# మహితాత్ముడు

## శ్రీ మండలి వెంకట కృష్ణారావు



రచన

**రావినూతల శ్రీరాములు**

సెల్: 8885653924



"నేను తెలుగు వాణ్ణి అనుకున్నప్పుడు
ఒళ్ళు పరవశిస్తుంది.
నాది తెలుగుగడ్డ అనుకోగానే
ఏదో దివ్య లోకంలో ఉన్న అనుభూతి కలుగుతుంది"

– *మండలి వెంకట కృష్ణారావు*

ముతక ఖద్దరు చొక్కా, పంచ
స్నేహం చిలికే చూపులు
ఆత్మీయత ఒలికే చిరునవ్వు
అంతరంగాన్ని పట్టి యిచ్చే పలుకు
ఇవన్నీ మనిషిగా రూపొందితే
మండలి వెంకట కృష్ణారావు మూర్తి

*– పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి*

ఆయన వెలుగు రేకుల
తెలుగు జాతి తలపూవు
ఆయన పేరు మండలి వెంకట కృష్ణారావు

*– "కరుణ శ్రీ" జంధ్యాల పాపయ్య శాస్త్రి*

# ఆదర్శమూర్తి

**- డా॥ ఎ. చక్రపాణి**
*పిహెచ్.డి. (లా), ఎల్ఎల్.డి.*
**మాజీ అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ శాసనమండలి**

శ్రీ రావినూతల శ్రీరాములుగారు రచించిన 'మహితాత్ముడు' చదువుతుంటే శ్రీ మండలి వారితో ఉన్న ఆత్మీయానుబంధం, ఎన్నెన్నో మధుర జ్ఞాపకాలు నెమరువేసుకునే అవకాశం కలిగింది.

నవంబర్ నెల వచ్చిందంటే నాకు 1977 సంవత్సరం నాటి దివిసీమ ఉప్పెన, తుఫాను గుర్తుకు వస్తాయి. ఉప్పెన, తుఫాను గుర్తుకురాగానే మండలి వెంకట కృష్ణారావు గారు గుర్తుకు వస్తారు. ఆయన నాకు మంచి మిత్రులు, శ్రేయోభిలాషి. నాకన్నా వయస్సులో పెద్ద. నన్నెప్పుడూ ఒక తమ్ముడిగా చూసేవారు. అప్పుడాయన జలగం వెంగళరావు గారి మంత్రివర్గంలో విద్యా సాంస్కృతిక శాఖా మంత్రి. 1975 ఏప్రిల్‌లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు జరిపి మంచి పేరు తెచ్చుకున్నారు. అప్పుడు నేను ఎం.ఎల్.సి.గా. ఉండేవాడిని. అంతకు ముందే ఆయన పి.వి. నరసింహారావు గారి మంత్రివర్గంలో సాంఘిక సంక్షేమ శాఖా మంత్రిగా పనిచేసి, బడుగు, బలహీన వర్గాలకు ఎంతో సేవచేసి, తానేమిటో నిరూపించుకున్నారు. పి.వి. వీరిని తన మంత్రివర్గంలోకి తీసుకుని, నీకేశాఖ కావాలని నా ఎదుటే అడిగారు. అందుకాయన సాంఘిక సంక్షేమ శాఖను కోరుకోగా పి.వి. గారు ఆశ్చర్యపోయి 'అదేమిటి! నీకు ఇంతకన్నా చురుకైన శాఖను ఇద్దామనుకున్నాను. ఎవరూ కోరని శాఖని కోరావు' అన్నారు. దానికి ఆయన 'ఇందులో అయితే పేదవారికి సేవచేసే అవకాశం ఉంటుంది. అది నాకు ఇష్టమైన శాఖ' అన్నారు. దానికి పి.వి. గారి ముఖం ఎంతో ప్రసన్నంగా మారింది. ఈ విషయాన్ని పి.వి.గారే ఆ తర్వాత ఒక బహిరంగ సభలో చెప్పారు కూడా. కృష్ణారావు గారితో నేను చాలా సన్నిహితంగా ఉండేవాడిని. ప్రదేశ్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శులుగా ఇరువురము కలిసి పనిచేశాము. అయితే నిజం చెప్పాలంటే, అప్పుడు నాకు ఆయన నిస్వార్థ వ్యక్తిత్వం గురించి బాగా అర్థమైంది.

ముందే చెప్పినట్లు 1975 ఏప్రిల్‌లో ప్రపంచ తెలుగు మహాసభలను 'నభూతో నభవిష్యతి' అన్న రీతిలో వైభవోపేతంగా నిర్వహించి, ఆయన మంచి ఉత్సాహంతో ఉన్నారు. దానికి తోడు 1975 ఆగస్టు 4వ తేదీన ఆయన స్నేహితులు, అభిమానులు కృష్ణారావు గారి 51వ జన్మదినాన్ని అత్యంత ఘనంగా నిర్వహించారు.

ఆ విధంగా అప్పట్లో విజయపథాన పయనిస్తున్న ఆయన మొహంలో ఉత్సాహం ఉరకలు వేస్తూ ఉండేది. ఆయన ప్రస్తావన లేకుండా ఏరోజూ వార్తాపత్రికలు ఉండేవి

కావు. అంత ఉల్లాసంగా సాగుతున్న కాలంలో 1977 నవంబర్ 19వ తేదీన దివిసీమలో సంభవించిన ఉప్పెన, తుఫాను ఒక ఆశనిపాతం అని చెప్పాలి. ఆ విపత్తు సంభవించినప్పుడు కృష్ణారావు గారు అవనిగడ్డలోనే ఉన్నారు. తుఫాను గాలికి కొట్టుకుపోతున్న అనాథ బాలలను ప్రాణాలు లెక్కచేయకుండా పొదివి పట్టుకుని, ఇంట్లోకి చేర్చారు. ఆనాడు ఆయన అక్కడ లేకపోతే ఆ పిల్లలు తుఫానులో కలిసిపోయేవారే.

ఆ రాత్రి వచ్చిన ఉప్పెన భీకర స్వరూపం మర్నాటికి కానీ తెలియలేదు. ఊళ్ళకు ఊళ్ళు తుడిచిపెట్టుకుపోయాయి. సముద్రంలో అలలు తాటి చెట్టు ఎత్తున ఎగిసిపడుతూ దివిసీమను కబళించాయి. ప్రళయాన్ని తలపించే సముద్రపుటలలపై బడబాగ్నిని చూశామని కొందరు చెప్పారు. మన దేశంలో అప్పటికి ఆధునిక సాంకేతిక వ్యవస్థ బలపడలేదు. వాతావరణాన్ని ముందుగా అంచనా వేసే ఉపగ్రహాలు మనకింకా సమకూరలేదు. అప్పటికి టి.వి.లూ మనకు కొత్తే. కృష్ణా కోస్తాలో జలప్రళయం సంభవించిందని అమెరికా ప్రభుత్వం మన కేంద్ర ప్రభుత్వాన్ని హెచ్చరిస్తే కానీ దాని ఉద్ధృతి గురించి మన ప్రభుత్వాలకు తెలియలేదు. పదివేల మంది చనిపోయారని లక్షలాది పశువులు అసువులు బాశాయని తరువత తెలిసింది. కనీ వినీ ఎరుగని ఆ జలప్రళయం చూసి కృష్ణారావుగారి గుండె చెరువైంది. ప్రయాణ సౌకర్యాలు మెరుగైన తరువాత హైదరాబాద్ నుంచి మేము వెళ్ళేసరికి దివిసీమ దైన్యమంతా ఆయనలో కనిపించింది. ముళ్ళు విరిగి, గాయాలైన కాళ్ళకు గుడ్డలు కట్టుకుని, చింపిరి జుట్టుతో, పెరిగిన గడ్డంతో దీనాతి దీనంగా ఆయన దర్శనమిచ్చారు. చూడగానే ఆయన మళ్ళీ మామూలు మనిషి అవుతారా అనిపించింది.

కృష్ణారావుగారి పిలుపందుకుని ఎన్నో జాతీయ, అంతర్జాతీయ స్వచ్ఛంద సేవా సంస్థలు సహాయ కార్యక్రమాలను చేపట్టాయి. ప్రభుత్వాలు సహాయమందించాయి. అప్పటి ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్, మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ, మదర్ థెరీసా వంటి ప్రముఖులెందరో దివిసీమను సందర్శించారు. ధన రూపంలోనూ, వస్తు రూపంలోనూ దివిసీమకు అందిన సహాయానికి కొదవేలేదు. ఒకటి రెండు సంవత్సరాలలోనే దివిసీమలోని పల్లెలను పక్కా ఇళ్ళు, సి.సి. రోడ్లు, కరెంటు సరఫరా వంటి ఆధునిక హంగులతో పునర్నిర్మించారు కృష్ణారావుగారు. నాటి గాంధీ పశ్చిమ సముద్ర తీరాన వెలసిన పోర్ బందర్‌లో జన్మించి, దేశానికి స్వాతంత్ర్యం సముపార్జించి మహాత్ముడైనాడు. మన కృష్ణారావుగారు గాంధీయ సిద్ధాంతాలను తూ.చ. తప్పకుండా ఆచరించి, ప్రజాసేవలో లీనమై దివిసీమ గాంధీగా పేరు గడించారు.

కాలం గడుస్తూనే ఉంది. కృష్ణారావుగారు తన కలల సాకారంగా నిర్మించుకున్న దివిసీమకు ఉప్పెన వచ్చి అప్పుడే నలభై ఏళ్ళు గడిచాయి. ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు ద్వారకను పశ్చిమ సముద్రం ఒడ్డున అత్యంత సుందరంగా నిర్మించుకున్నాడు. ఆయన నిర్యాణం చెందిన రోజే ఆ ద్వారాక సముద్ర గర్భంలో కలిసిపోయింది. ఇది దేశానికి

పశ్చిమ తీర సముద్రపు ఒడ్డున జరిగింది. ఆనాడే కలియుగం ప్రారంభమైంది. ఇది జరిగి 5117 సంవత్సరాల కాలం గడిచింది. ఆ పట్టణాన్ని మన పురావస్తు శాస్త్రవేత్తలు ఆరేబియా సముద్రంలో కనుగొన్నారు. కృష్ణారావు గారి దివిసీమను సముద్రం కబళించినా దానిని ఆయన పునర్నిర్మించుకున్నారు. ఇది దేశానికి తూర్పు తీరంలో బంగాళాఖాతం ఒడ్డున జరిగింది. ఆ తర్వాత 20 సంవత్సరాలు ఆయన తన దివిసీమను చూసుకుంటూ జీవించారు. కృష్ణారావుగారు పరమపదించి 20 ఏళ్ళు గడిచాయి. దివిసీమను ఉప్పెన తాకి 40 ఏళ్ళు గడిచాయి.

ఇప్పుడు మండలి కృష్ణారావుగారు లేరు. దివిసీమలో అప్పటి ఉప్పెన తాలూకు గుర్తులూ లేవు. ఆ మహోత్పాతం గురించి ఈ తరం వారికి తెలియదు. అయితే కృష్ణారావు గారి సుకృతం కొద్దీ ఆయన కార్యక్రమాలను ఆయన కుమారుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు నిర్విరామంగా కొనసాగిస్తున్నారు. తండ్రికి తగ్గ తనయుడుగా కీర్తి గడిస్తున్నారు.

శ్రీ రావినూతల శ్రీరాములుగారు సంగ్రహంగా మండలి వారి జీవిత గాథను నేటి తరానికి పరిచయం చేయడం ఎంతో ముదావహం. శ్రీ మండలి వారితో కలిసి పనిచేసిన వారికి వారి మహోన్నత వ్యక్తిత్వం గురించి తెలుసు. శ్రీ రావినూతల శ్రీరాములుగారు వారి చిరు పుస్తకం ద్వారా శ్రీ మండలి వారి గురించి నేటి తరం తెలుసుకుని, వారి సేవా తత్పరతను, త్యాగశీలతను, నైతిక ప్రమాణాలను ఆచరించితే దేశాభ్యుదయానికి పాటుపడినవారు కాగలరు. ప్రత్యేకించి నేటి ప్రజాప్రతినిధులకు శ్రీ మండలి వారి జీవితం ఆదర్శం కావాలి. రచయిత శ్రీ రావినూతల శ్రీరాములు గారికి నా అభినందనలు.



# విషయ సూచిక

# 1 దివిసీమ వైభవం

నవ్యాంధ్ర రాజధాని నెలకొన్న కృష్ణా జిల్లా ఉత్తర కొసనగల లంక ప్రాంతమే దివిసీమ.

ఇక్కడ నెలకొన్న దివ్య క్షేత్రాల కారణంగానే దివిసీమ అనే పేరు సార్థకమయింది. ముఖ్యమైన క్షేత్రాలు పరిశీలిద్దాం.

**శ్రీకాకుళం:**

ఆంధ్ర శాతవాహనుల తొలి రాజధాని. ఆంధ్ర విష్ణువు వేంచేసి ఉన్న పావన క్షేత్రం. "దేశ భాషలందు తెలుగు లెస్స" ఇక్కడ నుండే వెలువడింది. శ్రీ కృష్ణ దేవరాయలు ఇక్కడ విడిది చేసిన రాత్రి ఆంధ్ర విష్ణువు ఆయనకు స్వప్న దర్శనం అనుగ్రహించి ఆముక్తమాల్యద తెలుగులో రచించమని ఆదేశిస్తూ ...

**"తెలుగేల యన్న దేశంబు తెలుగేను**
**తెలుగు వల్లభుండ తెలుగొకండ**
**ఎల్ల నృపులు గొల్వ నెఱుగవే బాసాడి**
**దేశభాషలందు తెలుగులెస్స"**

అని పలికాడు.

**కూచిపూడి:**

శ్రీకాకుళానికి ఆరు మైళ్ళ దూరంలో ఉన్న కూచిపూడి – కూచిపూడి నాట్యానికి ఆద్యుడైన సిద్ధేంద్ర యోగి జన్మస్థలం. యక్షగాన పద్ధతికి భిన్నంగా ప్రాచీన నాటకం జానపద సంప్రదాయంతో సమ్మిళితం చేసి కూచిపూడి నాట్య ప్రక్రియను రూపొందించిన విధాత ఇతడే! గోల్కొండ ప్రభువు అబుల్ హసన్ తానీషా కూచిపూడి కళాకారులకే ఆ గ్రామాన్ని మాన్యంగా ఇచ్చాడు.

**మొవ్వ:**

కూచిపూడికి రెండు మైళ్ళ దూరంలో ఉన్న ఈ గ్రామంలోనే భక్తి, శృంగార పదకర్త, క్షేత్రయ జన్మించి మొవ్వ వేణుగోపాలని తన పదాలతో స్తుతించాడు.



**తలగడదీవి:**

నృత్యరత్నావళి కర్త జాయప సేనాని జన్మస్థలమిది.

**ఘంటసాల:**

అతి ప్రాచీనమైన బౌద్ధ స్తూపమే గాకుండా జలదీశ్వర స్వామి వెలసిన పుణ్యక్షేత్రం.

**అవనిగడ్డ:**

ఇక్కడ గల 10వ శతాబ్దం నాటి లక్ష్మీనారాయణ దేవస్థానం వారసత్వ సంపదగా ప్రకటించి రూ. 50 లక్షల వ్యయంతో పునరుద్ధరింపబడింది.

**భావదేవరపల్లి:**

ఇక్కడ ప్రసిద్ధ భావనారాయణ స్వామిదేవాలయం ఉంది. మండలి వారి స్వస్థలం కూడా ఇదే!

**హంసలదీవి:**

పరమపావనమైన సాగరసంగమ ప్రాంతంలో శ్రీ వేణుగోపాలస్వామి వేంచేసిన పుణ్యక్షేత్రమిది.

అవనిగడ్డ దివిసీమ కేంద్రం. 1977లో వచ్చిన ఉప్పెనలో సర్వ నాశనమైన గ్రామాలలో సేవలందించ వచ్చిన గాంధీజీ అంతేవాసి ప్రభాకర్ జీ అవనిగడ్డకు సరికొత్త నిర్వచనమిచ్చారు.

**అ: అన్నానికి**

**వ: వస్త్రానికి**

**ని: నివాసానికి లోటు లేని**

ప్రదేశమే అవనిగడ్డ అంటారాయన. ఇక్కడ గల రమణీయ ప్రకృతికి ముగ్ధుడైన ప్రఖ్యాత రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి తన ప్రసిద్ధ నవల "కృష్ణాతీరం" కథా పరిసరాలు అవనిగడ్డతోనే లంకె పెట్టారు.

★ ★ ★



## 2 మండలి వారి వంశానుక్రమం

కొన్ని వందల సంవత్సరాల పాటు విజయవంతంగా సాగిన విజయనగర సామ్రాజ్యం 18 శతాబ్ది ప్రారంభానికి పూర్తిగా పతనమైంది. సామ్రాజ్యానికి మూలస్తంభాలయిన సేనాపతులు, కుటుంబాలతో సహా విజయనగరం నుండి తరలి ఇతర ప్రాంతాలకు వెళ్ళిపోయారు.

అలా ఆంధ్ర దేశానికి తరలివచ్చిన మండలి కుటుంబీకులు దివిసీమలో స్థిరపడ్డారు. వీరి మూల పురుషుడు చినపోతినీడు.

వీరి వంశ క్రమం ఇలా ఉంది.




★ ★ ★

# 3 కృష్ణారావుగారి జనకులు వెంకట్రామయ్యగారు

ప్రజాసేవకాంక్ష మండలి వారి రక్త నాళాలలో తరతరాలుగా జీర్ణించుకొని పోయింది.

కృష్ణారావుగారి జనకులు శ్రీ మండలి వెంకట్రామయ్య భావదేవరపల్లిలో అధ్యాపకుడుగా మూడు దశాబ్దాలు పనిచేశారు.

ఆదర్శ ఉపాధ్యాయుడుగా ప్రజల మన్నన పొందాడు.

వీరి శిష్యులలో ప్రఖ్యాత కమ్యూనిస్టు నేత శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారొకరు. ఉద్యోగ విరమణ పిమ్మట మూడు పర్యాయాలు ఆ గ్రామ పంచాయితీ అధ్యక్షుడై గ్రామ సర్వతోముఖాభివృద్ధికి కృషి చేశాడు. గ్రామం చుట్టూ ప్రక్కన ఉన్న కాల్వలకు వంతెనలు, రోడ్లు, మంచినీటి బావులు, పాఠశాల భవనాలు, పశువుల ఆస్పత్రి, గ్రామీణ ఆస్పత్రి మొదలయినవి అన్ని ఆయన హయాంలో ఆ ఊరికి సమకూరాయి.

ఉన్నత పాఠశాల ఏర్పాటులో కూడా ఆయన ప్రముఖ పాత్ర వహించాడు. 1984 జూన్ 24న అవనిగడ్డ గాంధీక్షేత్రంలో మండలి వెంకట్రామయ్యగారి చిత్రపటావిష్కరణ సభలో సుప్రసిద్ధ కమ్యూనిస్టు నేత, ఆయన పూర్వ విద్యార్థి అయిన చంద్ర రాజేశ్వరరావు ఇలా చెప్పారు.

“వెంకట్రామయ్యగారు మా గ్రామం మంగళాపురంలో చాలా సంవత్సరాలున్నారు. రెండు తరాలవారు ఆయన దగ్గర అక్షరాభ్యాసం చేశారు. నేను, మా అన్నగారు కూడా ఆయన దగ్గర అక్షరాభ్యాసం చేశాం.

ఆ రోజుల్లో స్కూలుకు పోకపోతే ఈడ్చుకుంటూ వెళ్ళి స్కూలులో కూర్చోపెట్టేవారు. తరువాత అలా కాకుండా ఆయన టైములో ప్రతి పిల్లవాడు కూడా స్కూలుకు పరుగెత్తాలని ఉత్సాహ పడేవారు. ఎందుకంటే ఆయన టైములో ఏ చిన్నవాణ్ణి తిట్టలేదు, బెత్తమనేది లేదు. అలా కాకుండా కష్టించి చదువు చెప్పేవారు.

మా స్కూలులో ఒక తోట పెంచారు. తోట పెంపకాన్ని ఆయనే మాకు నేర్పారు. ఆ కాలమంతా ఆయన అనుభూతి పొందే విద్య నేర్చుకున్నాం. మన కృష్ణారావు గారిని నేను రక్త బంధువుగా భావిస్తాను”.





# 4 మండలి వారి బాల్యం

కొల్లేటి ఒడ్డున గల పల్లెవాడ గ్రామంలో దుట్టా రామయ్య అక్కలక్ష్మీ దంపతులు గ్రామస్తులందరితో కలుపుకోలుగా ఉండేవారు వారి పెద్ద కుమార్తె మహంకాళమ్మను వెంకట్రామయ్యగారు ద్వితీయ వివాహం చేసుకున్నారు.

వెంకట్రామయ్య మహంకాళమ్మ దంపతులకు తొలి సంతానంగా 1926, ఆగష్టు 4న పల్లెవాడలో వెంకట కృష్ణారావు జన్మించారు. మహంకాళమ్మ ఉదార స్వభావం గల ఇల్లాలు. వెంకట్రామయ్యగారి మొదటి భార్య కుమార్తెను సంరక్షణ చేశారు.

ఈయన బాల్యమంతా భావదేవరపల్లిలో గడిచింది. వెంకట్రామయ్యగారికి గాంధీ మహాత్ముడు ఆరాధ్య నాయకుడు. ఇంటిల్లిపాదీ నియమంగా ఖద్దరు వస్త్రాలనే ధరించేవారు.

కృష్ణారావుకు ముమ్మూర్తులా తండ్రి గుణాలే అబ్బినాయి.





# 5 ఉన్నత పాఠశాల విద్య

కృష్ణారావుగారి ప్రాథమిక విద్య తండ్రి చెంతనే జరిగింది. ఉన్నత పాఠశాలలో ప్రవేశానికి ఇంగ్లీషు అవసరమయి ఉన్నందున కొంతకాలం పులిగడ్డలో పినతండ్రి కుటుంబరావు నుండి తర్ఫీదు పొందారు.

అవనిగడ్డ హైస్కూలులో చేరటానికి ప్రవేశ పరీక్షకు వెళ్ళిన విద్యార్థి కృష్ణారావు ...2 ఫారం ప్రవేశానికి దరఖాస్తు చేయగా 3వ ఫారంలో ప్రవేశం లభించింది.

అవనిగడ్డ హైస్కూలులో ఉపాధ్యాయులైన శ్రీ చిలకపాటి సుబ్బారావు వల్ల ప్రభావితులైన కృష్ణారావు 1941, 1942 ఉద్యమాలలో ఉడతా భక్తిగా పాల్గొనే అవకాశం కలిగింది.

పాఠశాలలో జాతీయ విద్యార్థి సంఘం ఏర్పాటు కాగా కృష్ణారావు దానికి అధ్యక్షులుగా ఎన్నికైనారు.

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కార్యకర్తలకు అజ్ఞాతంగా తోడ్పడుతూ ఉండేవారు శ్రీ కృష్ణారావు.

విద్యార్థిగా ఉన్న కాలంలో కిరోసిన్ కొరత ఏర్పడింది. రాత్రి పూట విద్యార్థులు చదువుకు అంతరాయం కలిగేది. కృష్ణారావు ఇంటింటికీ తిరిగి దుకాణాలకు వెళ్ళి కిరోసిన్ సేకరించి సోదర విద్యార్థులకు అందించి సాయపడేవారు.

1945 లో కృష్ణా జిల్లా విద్యార్థి కాంగ్రెసు కార్యదర్శిగా బొంబాయి వెళ్లి మహాత్మాగాంధీని శ్రీ కృష్ణారావు దర్శించారు.

ఆ తొలి దర్శన ప్రభావమే ఆయనకు జీవిత కాలం గాంధీజీ అంతేవాసిగా మార్చివేసింది.





# 6 బందరు హిందూ కళాశాలలో

1946 లో శ్రీ కృష్ణారావు బందరు హిందు కళాశాలలో విద్యార్థిగా చేరారు. నాయకత్వ లక్షణాలు సహజంగానే ఉన్న కృష్ణారావు విద్యార్థులను సంఘటిత పరచి అప్పుడు అమలులో ఉన్న డిటెన్షన్ విధానంపై పోరాడి విజయం సాధించారు.

స్వాతంత్ర్యం రానున్న తరుణంలో కళాశాలలో పది రోజుల పాటు జరిగిన విద్యార్థుల సమ్మెకు కృష్ణారావు నాయకత్వం వహించారు.

ఒకనాడు కాలేజీ ప్రిన్సిపాల్‌ను లోనికి ప్రవేశింపకుండా అడ్డుకున్నారు. కృష్ణారావును నిర్భంధంలోకి తీసుకొన్నారు. తర్వాత కొద్ది దినాలకే దేశానికి స్వాతంత్ర్యం లభించింది.

స్వాతంత్ర్య దినోత్సవం బందరులో వైభవంగా జరిగింది. ఆనాడు కాంగ్రెసు ప్రముఖులైన శ్రీ కాశీనాధుని పూర్ణమల్లికార్జునుడు కృష్ణారావు శక్తి సామర్థ్యాలను గుర్తించి కొన్ని బాధ్యతలను అప్పగించారు. విద్యార్థిగా ఉంటూనే 1948 లో కృష్ణాజిల్లా యువజన కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైన శ్రీ కృష్ణారావు యువకులలో ఉత్తేజం కల్గించారు.







# 7 రాజకీయ రంగ ప్రవేశం

1952 సాధారణ ఎన్నికలలో ఆంధ్రదేశంలో కాంగ్రెస్ ఘోర పరాజయం పాలయింది.

ప్రముఖ కాంగ్రెసువాది శ్రీ కాశీనాధుని పూర్ణ మల్లికార్జునుడు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు కాగా కార్యదర్శిగా మండలి కృష్ణారావు నియమితులైనారు. శ్రీ కృష్ణారావు నిర్విరామంగా పనిచేసి కాంగ్రెసును తిరిగి తల ఎత్తుకునేటట్లు చేశారు.

బందరు మున్సిపల్ ఎన్నికలలో కాంగ్రెసు సాధించిన ఘన విజయాన్ని కొనియాడుతూ నాటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి రాజాజీ వీరి కృషిని కొనియాడారు. శ్రీ కృష్ణారావు జిలాల్లో విస్తృతంగా పర్యటిస్తూ రైతు కాంగ్రెసు మహాసభలు, యువజన సభలు, గీత కార్మికుల మహా సభలు విజయవంతంగా నిర్వహించారు.

బుడమేరు రైతు మహాసభలు జరిపి సంబంధిత సమస్యల పరిష్కారానికి కృషి చేశారు.



# 8 సహధర్మచారిణి శ్రీమతి ప్రభావతీదేవి

పులిగడ్డకు చెందిన భోగాది వెంకట రామయ్య, మండలి వెంకట రామయ్య గార్లు చిన్ననాటి స్నేహితులు. సహపాఠులు. మిత్రునితో పాటు వెంకట రామయ్య కొంతకాలంలో సర్వేశాఖలో పనిచేశారు. కానీ,అ అధ్యాపక వృత్తి పట్ల అభినివేశంతో ఉపాధ్యాయుడుగా స్థిరపడ్డారు. వెంకటరామయ్య తన కుమారుడు వెంకట కృష్ణారావుకు భోగాది వెంకట రామయ్య కుమార్తె ప్రభావతీదేవితో వివాహం నిశ్చయించి స్నేహాన్ని బాంధవ్యంగా మలచుకున్నారు.



1952 మే19న నాగాయలంకలో వీరి వివాహం వైభవంగా జరిగింది.

కృష్ణారావుగారి కార్యకలాపాలలో ప్రభావతీదేవి చేదోడువాదోడుగా ఆదర్శ దంపతులని ప్రశంసలనందుకున్నారు. వీరి అన్యోన్య దాంపత్య జీవితంలో 1956 సంవత్సరం సువర్ణ అధ్యాయం. ఆ సంవత్సరం ఆసియాజ్యోతి, అహింసామూర్తి బుద్ధ భగవానుని 2500 జయంతి విశ్వవ్యాప్తంగా జరిగాయి.

1956 మే 26న వారికి వంశాకురం ఉదయించాడు.

బాలునికి బుద్ధ భగవాన్ పేర బుద్ధప్రసాద్ అని పేరు పెట్టారు. అనంతర కాలంలో సుమతి శతకకారుడు చాటిన విధంగా పుత్రోత్సాహం కలిగించాడు.

కృష్ణారావుగారికి ఇద్దరు కుమార్తెలు – అన్నపూర్ణ, రేవతి. పెద్ద అల్లుడు డాక్టర్ పద్యాల చంద్రశేఖర్, రెండవ అల్లుడు డాక్టర్ ఎం.ఎస్.వి.బి. కోటేశ్వరరావు, పిల్లల వైద్యుడు. "భవఘ్న గురూజీ"గా ప్రసిద్ధులు.

శ్రీ బుద్ధ ప్రసాద్, శ్రీమతి విజయలక్ష్మి దంపతులకు ఇద్దరు కుమార్తెలు – కృష్ణప్రభ, అవనిజ, కుమారుడు – వెంకట్రామ్

కృష్ణారావు రెండవ కుమారుడు శ్రీ సత్యప్రసాద్, శ్రీమతి వాణిశ్రీ దంపతులకు ఒక కుమారుడు – ఫణి సాయి కృష్ణ.





# 9 పార్లమెంటు సభ్యునిగా...

1957లో దేశమంతటా సాధారణ ఎన్నికలు జరిగాయి. బందరు పార్లమెంటు సీటుకు కాంగ్రెసు అభ్యర్థిగా యువకుడు, ఉత్సాహవంతుడైన మండలి వెంకట కృష్ణారావు గారి పేరును శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రతిపాదించారు. అప్పటికి మండలివారి వయస్సు 31 సంవత్సరాలు మాత్రమే!

చల్లపల్లి రాజావారి అండతో బరిలో నిల్చిన ప్రత్యర్థి శ్రీ యలమంచిలి నాగభూషణంతో తీవ్రస్థాయి పోటీ జరిగింది. కానీ, ఏడువేల ఓట్లు మెజారిటీతో శ్రీ కృష్ణారావు విజయం సాధించి పార్లమెంటుకు ఎన్నికైనారు.

1957 నుండి 1962 వరకు ఐదేళ్ళ పాటు లోక్ సభలో ప్రధాని జవహర్ లాల్ నెహ్రూతో సహా ఉద్ధండుల సరసన అతి పిన్న వయస్కుడైన కృష్ణారావు అపార అనుభవాన్ని పొందారు.

ఆ కాలంలో లోక్ సభ స్పీకరుగా ఉన్న శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ అభిమానాన్ని శ్రీ మండలి చూరగొన్నారు. ఆనాటి పరిస్థితిని గూర్చి ఆయన కుమారుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్ ఇలా తెలిపాడు:

“బందరు పార్లమెంటరీ నియోజకవర్గం నుండి మా నాన్న మండలి వెంకట కృష్ణారావు గారు లోక్ సభలో ప్రవేశించారు. అతి చిన్న వయస్సులో పార్లమెంటు సభ్యులుగా మా నాన్నగారు గుర్తింపు పొందారు. స్పీకర్ అనంతశయనం అయ్యంగార్ మా నాన్నగారిపై ఎంతో ప్రేమాభిమానాలు చూపేవారు. కొత్తగా లోక్ సభలో ప్రవేశించిన మా నాన్నగారిని శిష్య వాత్సల్యంతో అభిమానిస్తూ, లోక్ సభ సంప్రదాయాలను తెలియజెప్పేవారు.

అనంతశయనం అయ్యంగార్ గురించి “మనిషి నెమ్మదస్తుడు. మృదు స్వభావం కలవాడు. నిరుపేదలకు అండ. వారికి బంధువు. నిరాడంబరమైన జీవితాన్ని గడుపుతూ అందరికీ అందుబాటులో ఉంటాడు. వినయ విధేయతలు కలిగి ఎప్పుడూ ఉత్సాహంగా ఉంటాడు మండలి. ఒక మహా పురుషునికి ఉండవలసిన మంచి లక్షణాలన్నీ ఆయనలో కనబడతాయి” అని అన్నారు.

వీరిద్దరి గురుశిష్య సంబంధం అనంతశయనం 1978 మార్చిలో ఆయన తుదిశ్వాస విడిచే వరకు కొనసాగింది.



1975 ఏప్రిల్ లో జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలలో మా నాన్నగారు అయ్యంగారిని ఘనంగా  సన్మానించారు".

సీనియర్ పార్లమెంటు సభ్యులైన ఆచార్య రంగా కూడా శ్రీ మండలిని ఆప్యాయంగా చూసేవారు.

కృష్ణానదీ ముఖ ద్వారం 'గుల్లలమోద' వద్ద బ్రిటీష్ వారి హయాంలో నిర్మించిన లైట్ హౌస్  (Light House) చెడిపోయింది.

శ్రీ మండలి పార్లమెంట్ సభ్యుని హోదాలో చేసిన కృషి ఫలితంగా దివిసీమ వద్ద నౌకాయానానికి సౌకర్యంగా ఉండే రీతి 15 మైళ్ళ మేరకు కాంతి ప్రసరించే పెద్ద లైట్ హౌస్ రూ. 10 లక్షల వ్యయంతో మంజూరయింది.

★ ★ ★





# 10 కాంగ్రెసు పునరుజ్జీవనకు కృషి

శ్రీ మండలి వెంకట కృష్ణారావు కృష్ణా జిల్లాలో కాంగ్రెసు బలపడటానికి తన శక్తియుక్తులన్నీ వినియోగించారు. 1957లో “నవీనాంధ్ర” పక్షపత్రికను బందరు నుండి కొంత కాలం సమర్థవంతంగా నిర్వహించారు.

బందరులో రాష్ట్ర రైతాంగ విద్యాలయాన్ని పక్షం దినాలు నిర్వహించారు. బంజరు భూముల పంపకం పట్ల శ్రద్ధ వహించిన శ్రీ కృష్ణారావు 1954 మేలో కృష్ణా జిల్లాలో రైతు మహాసభలు నిర్వహించారు.

1954 జూన్ లో బంజరు పంపిణీ విధానం ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. బంజరు రైతులకు 5 ఎకరాల మెట్ట లేదా $2^{1}/_{2}$ ఎకరాల మాగాణిగా నిర్ణయించింది. ఈ మేరకు భావదేవరపల్లిలో 1954 సెప్టెంబర్ లో పంపిణీ కార్యక్రమం ప్రారంభించబడింది.

1955 ఫిబ్రవరిలో ఆంధ్రలో జరిగిన ఎన్నికలలో కృష్ణారావుగారి అవిరళకృషి ఫలితంగా కమ్యూనిష్టుల కంచుకోట కూలిపోయి కాంగ్రెసు విజయపతాకం ఎగుర వేసింది.



1956-58 లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంయుక్త కార్యదర్శిగా, భూదాన యజ్ఞ సంఘానికి నిర్వాకులుగా కృష్ణారావు పనిచేశారు.

1958లో కృష్ణాజిల్లాలో కాంగ్రెస్ కురువృద్ధులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి జరగాల్సి ఉంది. అయితే శ్రీ బ్రహ్మయ్య అందుకు అంగీకరించలేదు. శ్రీ కృష్ణారావు ఒక పథకం వేసి బ్రహ్మయ్య అంగీకరించేటట్లు చేశాడు.

అప్పట్లో బందరులో గల జిల్లా కాంగ్రెస్ భవనం 3 గదులతో మాత్రమే ఉండేది. దానికి “పట్టాభి భవనం” అని పేరు.

దానికి పైన 3 గదులను చేర్చి పైన పెద్ద హాలు నిర్మించి “బ్రహ్మయ్య షష్టిపూర్తి హాలు”గా నామకరణం చేయాలని ప్రతిపాదించి పెద్దలందరి చేత ఆమోదింపచేశారు శ్రీ కృష్ణారావు.

శ్రీ బ్రహ్మయ్యగారు కూడా అంగీకరించక తప్పలేదు. శ్రీ మండలి నా మనుమడు. అతని ముద్దు చెల్లించాల్సిందేగా అని వ్యాఖ్యానించారు. ★



# 11 కృష్ణాజిల్లా పరిషత్ ఉపాధ్యక్షునిగా...

1957-62 కాలంలో పార్లమెంట్ సభ్యునిగా పనిచేసిన తరువాత జరిగిన ఎన్నికల్లో శ్రీ కృష్ణారావు విజయం సాధించలేక పోయారు.



కానీ ఆయన ప్రజాసేవకు అంతరాయం కలుగకుండా 1963లో కృష్ణాజిల్లా పరిషత్తు ఉపాధ్యక్ష పదవి లభించింది. ఆ పదవిలో పలు పథకాలకు రూపకల్పన చేశారు.

వీటిలో ప్రధానమైనది వాడపాలెం, గుండేరు వరదకట్ట. గుండేరు డ్రైనేజి పథకం ప్రతిపాదించిన వరదకట్టను వాడపాలెం వద్ద ఉన్న వరద కట్టకు కలుపుతూ ఒక వరదకట్టను నిర్మించారు. దీనివల్ల 10 వేల ఎకరాలకు ముంపు నుండి భద్రత ఏర్పడటమే గాక 14 వేల ఎకరాల భూమిని సాగులోనికి తేబడింది. అప్పటి కేంద్ర మంత్రి శ్రీ కె. యల్. రావును కలిసి నిధులు మంజూరు చేయించారు.

దివిసీమ వ్యవసాయ బృహత్తర ప్రణాళిక వీరి హయాంలోనే కార్యరూపం దాల్చింది. ఒక కోటి 50 లక్షల రూపాయల పెట్టుబడితో ఇది రూపొందించబడింది.

30 వేల ఎకరాల బంజరు భూమి సాగులోకి తీసుకొని రాబడింది. ఈ పథకం 3 సంవత్సరాల కాలంలో పూర్తి అయింది. నాలుగు వందల సహకార వ్యవసాయ సంఘాలు ఇందులో భాగస్వాములయినారు.

ఈ పథకాన్ని 1967 సెప్టెంబరు 9న నాటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రారంభం చేస్తూ, శ్రీ మండలి వారి కృషిని మిక్కిలి కొనియాడారు. రాష్ట్రపతి సహా పలువురు కేంద్ర నేతలు శుభాకాంక్షలు తెలిపారు.





# 12 అవనిగడ్డ గాంధీక్షేత్రం

గాంధీతత్వాన్ని నిలువెల్లా జీర్ణించుకొన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు అవనిగడ్డలో గాంధీక్షేత్రం నెలకొల్పాలని 1968 లో సంకల్పించారు. ఇందుకోసం జిల్లా పరిషత్ వారి నుండి 82 సెంట్ల స్థలాన్ని అవనిగడ్డలో సేకరించారు.

గాంధీక్షేత్రంనకు సంబంధించిన వివిధ కార్యక్రమాల నిర్వహణకు భవనములు నిర్మించారు. శ్రీ కోసూరి రత్తయ్యగారి పేర గ్రంథాలయ భవనం, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి పేర మరొక భవనము, శ్రీ తిరుమలశెట్టి కుమారస్వామి, శ్రీ శీలం వీర రాఘవయ్యగార్ల విరాళములతో మహిళా భవనము కట్టబడినాయి. మచిలీపట్నం రోల్డు గోల్డు కవరింగ్ అసోసియేషన్ వారు కట్టించిన భవనమునకు మహాత్ముని కోడలు శ్రీమతి నిర్మలాగాంధీ ప్రారంభోత్సవం చేశారు. ఆరుబయలు రంగస్థలానికి ప్రఖ్యాత సినీ నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. తదనంతర కాలంలో శ్రీ మండలి బుద్ధప్రసాద్ జర్మనీలో మేయర్‌గా ఉన్న డాక్టర్ గుజ్జుల రవీంద్ర సహకారంతో సమావేశ మందిరం నిర్మింపచేశారు.

అవనిగడ్డలో అడుగుపెట్టగానే శ్రీ మండలి క్రీస్తు, బుద్ధుడు, గాంధీజీ పెద్ద విగ్రహాలు చూపరులలో భక్తి భావాన్ని పెంపొందిస్తున్నాయి.

1976లో గాంధేయ సమాజ సేవా సంస్థ గాంధీక్షేత్రంలో ఏర్పడింది. ఈ సంస్థ ఆధ్వర్యాన శిక్షణ శిబిరాలు నిర్వహించబడినాయి. విశేషమేమిటంటే శిబిరాలు జరుగుతున్నప్పుడు శ్రీ కృష్ణారావు శిక్షితులలో ఒకరుగా చేరిపోయేవారు.

ఒకసారి శిబిరంలో పాల్గొన్న తమిళ వ్యక్తి ఈ విషయాన్ని ఎంతగానో మెచ్చుకుంటూ ఒక రాష్ట్ర మంత్రివర్యులు తమలో ఒకరుగా ఉండటం ఇక్కడే చూస్తున్నాని ఆశ్చర్యపోయాడు.

అనాథ శరణాలయం 50మంది బాలబాలికలతో ప్రారంభమయి గురుకులంగా రూపొందింది. తర్వాత కాలంలో విద్యార్థుల సంఖ్య 150కి పెరిగింది. కాగా మత్స్య పారిశ్రామికుల సంతతి కొరకు ఏర్పాటైన ఆశ్రమ పాఠశాల తొలుత 130 మంది బాలబాలికలతో గాంధీక్షేత్రంలో ప్రారంభమైంది. వీరందరికీ గృహ వసతి, భోజన సదుపాయాలు ఉచితంగా అందించారు.

గాంధీక్షేత్రం శాఖోపశాఖలుగా విస్తరిల్లి బాలానంద సంఘం, లలిత కళా సమితి, గ్రామీణ యువజన వికాస సమితి, సాహితీ సమితి మొదలైన విభాగాలు ఏర్పడ్డాయి.



శ్రీ మండలి వెంకట కృష్ణారావు బి.ఇడి., డి.ఇడి. కళాశాల, హిందీ ప్రచారక విద్యాలయాలు గాంధీక్షేత్రంలో నెలకొల్పబడ్డాయి.

గాంధీక్షేత్రాన్ని దర్శించిన ప్రముఖులలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ, మురార్జీ, జగ్జీవన్ రామ్, చంద్రశేఖరరావు లాంటి నేతలే గాక స్వామి రంగనాథానంద, స్వామి చిదానంద, దాశరథి, సి. నారాయణరెడ్డి, సంజీవ్ దేవ్, కరుణశ్రీ, బోయి భీమన్న లాంటి ప్రముఖులున్నారు.

గాంధీక్షేత్రంలో అనేక మహాసభలు జరిగాయి. దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘ సేవకుల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ నాటకోత్సవాలు, కృష్ణాజిల్లా రచయితల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. వీటిలో ఆయా రంగాలలో ప్రసిద్ధులైన వారు పాల్గొన్నారు.

గాంధీక్షేత్రంతో అనుబంధం ఉన్న ప్రముఖులలో ప్రభాకర్ జీ, ఆచార్య రంగా, కోదాటి నారాయణరావు, ఎం.ఎస్. రాజలింగం, లవణం, హేమలతా లవణం, జాన్ డేవిడ్, వావిలాల గోపాలకృష్ణయ్య, వేమూరి రాధాకృష్ణమూర్తి, కె.ఎస్. ఆచార్యులు, జయసింహాచారి, పి.హెచ్.ఎన్.బి. శర్మ, ముక్కామల నాగభూషణం ప్రభృతులు ఉండేవారు. వీరు తరచూ గాంధీక్షేత్రానికి వస్తూ మార్గదర్శనం చేసేవారు.

భారతదేశంలో గాంధీయ నిర్మాణ క్షేత్రాల్లో గాంధీక్షేత్రం ప్రాచుర్యాన్ని సంపాదించుకుంది.

గాంధీక్షేత్రంనకు అనుబంధంగా సేవాశ్రమంకు 5-10-77వ తేదీన గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలాగాంధీ మనుమడు శ్రీ కనూగాంధీ ప్రారంభోత్సవం చేశారు. 1977 నవంబరులో తుఫాను, ఉప్పెన బాధితుల సహాయ కేంద్రంగా రోజుకు 10 నుండి 20 వేల మందికి భోజన ఏర్పాట్లు నెల రోజుల పాటు ఈ సేవాశ్రమంలోనే జరిగాయి.





# 13 సాంఘిక సంక్షేమశాఖా మంత్రిగా...

ఆంధ్రప్రదేశ్ శాసనసభకు 1972 లో జరిగిన ఎన్నికల్లో శ్రీ కృష్ణారావు అవనిగడ్డ నియోజకవర్గం నుండి ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.

కృష్ణా జిల్లా చరిత్రలో ఏకగ్రీవ ఎన్నిక ఇదే ప్రథమం.

అహర్నిశం నియోజకవర్గ ప్రజల కోసం ముఖ్యంగా బడుగు వర్గాల అభివృద్ధికి తపించే మనీషి పోటీ లేకుండా ఎన్నుకోబడడంలో విశేషం లేదు.

నాటి ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు "మీకు మంత్రిగా ఏ శాఖ ఇవ్వమంటారు? అని అడిగారు". శ్రీ మండలివారు ఏ మంత్రి ఇష్టపడని సాంఘిక సంక్షేమ శాఖ కోరుకున్నారు.

ఒక్క సంఘటన జీవితకాలం పూలదండలు స్వీకరించరాదనే నిర్ణయం తీసుకునేటట్లు చేసింది.

మంత్రిగా ఒక గ్రామానికి శ్రీ కృష్ణారావు వెళ్ళారు. దాదాపు 300 మంది పేదలు ఇండ్ల స్థలాలు కోరుతూ స్వాగతం చెప్పటానికి తలా ఒక పూలదండ చేతబుచ్చుకొని వేచివున్నారు. మంత్రిగారు ఒక ఆసామితో ఇలా సంభాషించారు.

**మంత్రి:** ఈ పూలదండ ఖరీదెంత?

**ఆసామి:** మూడు రూపాయలు సారూ

**మంత్రి:** నీ దినసరి ఆదాయమెంత?

**ఆసామి:** రోజు కూలీ మూడు రూపాయలు.

**మంత్రి:** నేను 3 నిమిషాలు కూడా వేసుకోని దండ కోసం మీ రోజు కూలీ ఖర్చు చేయడం భావ్యమా!

నాటి నుండి తాను ఏ సందర్భంలోను పూలదండలు స్వీకరించరాదని నిర్ణయం తీసుకున్నారు.

మరొక నిర్ణయం కూడా ఆయన నిరాడంబరతకు ఉదాహరణంగా నిలిచింది.

"తాను ఒక మంత్రినని, నిత్యం ప్రజలతో కలిసిమెలిసి ఉండాల్సిన వాడనని, కారులో ప్రయాణిస్తుంటే తన ధర్మం నేరవేరదని భావించి, ప్రజా రవాణాసేవ – బస్సులోనే ప్రయాణం చేసిన ఔదార్యం కృష్ణారావుగారిది. అవినీతికి మారుపేరుగా నిలిచినా సంక్షేమ



శాఖను ప్రక్షాళన చేయడమే గాక, కృష్ణారావుగారు తన హయాంలో హరిజనులకు గృహ వసతి మొదలగు సౌకర్యాలు గాక, వర్ణాంతర వివాహాలకు ప్రోత్సాహకాలు ప్రవేశపెట్టారు. సాంఘిక సంస్కరణల సదస్సు నిర్వహించి కుల నిర్మూలన, నేరస్తుల సంస్కరణ కార్యక్రమాలకు ప్రభుత్వ పరంగా ప్రోత్సాహమిచ్చారు. సాంఘిక సంక్షేమం కోసం ప్రత్యేక సచివాలయ శాఖను, హరిజనులు, వెనుకబడిన తరగతులకు ఆర్థిక సహాయ సంస్థలను నెలకొల్పారు. ప్రైవేటు సంస్థలను ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు తెచ్చారు.

మత్స్య శాఖలో కూడం జాలర్ల సంక్షేమానికి ఎన్నో పథకాలు ప్రవేశ పెట్టి వారి అభివృద్ధికి దోహదం చేశారు.

1973 జనవరిలో రాష్ట్రపతి పాలన ప్రవేశ పెట్టడంతో కృష్ణారావుగారి మంత్రిత్వం ముగిసింది.

★ ★ ★



# 14 విద్యాశాఖా మంత్రిగా...

శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రి కాగానే శ్రీ కృష్ణారావుకు తిరిగి మంత్రివర్గంలో స్థానం లభించింది.

1974 జనవరి 12న ఆయన విద్యా సాంస్కృతిక శాఖ వ్యవహారాల మంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు. విద్యాశాఖలో చాలా మార్పులు వీరి హయాంలో జరిగాయి.

ఉన్నత విద్యకు ఒక డైరెక్టరును ప్రత్యేకంగా నియమించారు.

ప్రతి తాలూకాలోను జూనియర్ కళాశాలలు నెలకొల్పారు. డిగ్రీ కళాశాలల సంఖ్య పెరిగాయి. అనంతపురం, గుంటూరు, వరంగల్ లలో గల పి.జీ. కేంద్రాలు విశ్వ విద్యాలయాలుగా రూపొందాయి. అవే నాగార్జున, కాకతీయ, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాలు.

సాంకేతిక విద్యారంగంలో పాలిటెక్నిక్ లలో నూతన కోర్సులు ప్రవేశపెట్టారు.

శ్రీ యం.వి. రాజగోపాల్, ఐ.ఏ.ఎస్., అధ్యక్షతన కమిటీ వేసి సమగ్ర విద్యా బిల్లు రూపొందింప చేశారు.

ప్రముఖ విద్యావేత్త, ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య శ్రీ మండలివారి హయాంలో జరిగిన విద్యావ్యాప్తిని సమీక్షిస్తూ, "గత రెండు సంవత్సరాలలో విద్యారంగంలో జరిగిన ప్రగతికి క్రమశిక్షణయే మూల కారణం. దీని ఫలితంగా పరీక్షల్లో ప్రవేశించిన లోపాలన్నీ తొలగినవి. క్రమశిక్షణ ఆచరణ సాధ్యం చేయడంలో విద్యామంత్రి శ్రీ కృష్ణారావు శక్తి సామర్థ్యాలు ప్రశంసార్హములైనవి." అని పేర్కొన్నారు.

తెలుగుజాతి ఒకటే అని చాటేందుకు 1947 ఉగాదిన అఖిల భారత తెలుగు సాంస్కృతిక ఉత్సవాలు నిర్వహించారు. ఈ సభల్లోనే వావిలాల గోపాలకృష్ణయ్య గారిని తొలి అధికార భాషాసంఘం అధ్యక్షులుగా నియమించారు.

శ్రీ కృష్ణారావు మంత్రిగా వ్యవహరించిన తీరు గూర్చి పద్మశ్రీ ఆచార్య కొలకలూరి ఇనాక్ "మండలి వారంటే నాకు గౌరవం. చాలా ఇష్టం. నేనెప్పుడు అనంతపురం నుండి హైదరాబాదు వచ్చినా వారిని కలిసేవాణ్ణి. ఎంత పనులు, సందర్శకులు, ఒత్తిడి ఉన్నా, రెండు నిమిషాలయినా నేను నా పుస్తకం ఇవ్వటానికి సమయం ఇచ్చేవారు. నేనెప్పుడు విరివిగా వ్రాస్తూ ఉండేవాణ్ణి.

ఎం.వి. కృష్ణారావుగారిని దర్శించటానికి ఎవరికీ నిరాశ కలిగేది కాదు. వారు పూలదండలు వేయించుకునే వాళ్ళుకాదు. బస్సుల్లో ప్రయాణం చేసేవాళ్ళు.



మంది మార్భలం, హంగు, ఆర్భాటం ఉండేవి కావు. అసలు సిసలు సామాన్య నాయకుడు” అని తెలిపారు.

కర్నూలులో 1972 లో సిల్వర్ జూబ్లి కాలేజీ ప్రారంభించారు. అందులో బి.యస్.సి. చదివిన శ్రీ సలీం (తర్వాత కాలంలో ఇన్ కంట్యాక్స్ ఉన్నతోద్యోగి) తన అనుభవాలను ఇలా రాశారు. “నేను బి.యస్.సి. చదివే రోజుల్లో మండలి వెంకట కృష్ణారావు గారు విద్యాశాఖామాత్యులు. ఆ సమయంలో సిల్వర్ జూబ్లి కాలేజీకి అందుతున్న గ్రాంటు అపేయాలన్న ప్రతిపాదన వచ్చింది. శ్రీ కృష్ణారావుగారు మా కాలేజీకి వచ్చారు. విద్యార్థుల విన్నపాలను సావధానంగా విన్నారు.

మా కాలేజీలో ప్రతిభతో పాటు పేదరికంలో మగ్గే విద్యార్థులు చాలా మంది ఉండేవారు. అందులో నేనూ ఒకణ్ణి. మా ఆవేదనను అర్థం చేసుకున్న మంత్రి సానుకూలంగా స్పందించారు. మా కాలేజీ బ్రతికిపోయింది. ఆ రకంగా సిల్వర్ జూబ్లీ కాలేజీలో చదువుకున్న ప్రతి విద్యార్థి స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావుకు ఋణ పడి ఉంటారు.

డాక్టర్ అమరేశం రాజేశ్వర శర్మగారు తన అనుభవాలను ఇలా వ్రాశారు. “తెలుగు పండితులు తమ ఆవిష్కారాలను గూర్చి ఆంగ్లంలో ప్రచురించని కారణంగా వారికి తగినంత కీర్తి రావడం లేదని భావించి ఆంగ్లంలో రచనలు చేసే వారిని ప్రోత్సాహించాలనే సంకల్పంతో ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రారంభించడం జరిగింది. ఆ సందర్భంగా డా. సి. నారాయణరెడ్డి గారి నాయకత్వాన మేము కొందరు విద్యామంత్రిని దర్శనం చేయగా వారు అప్పటికప్పుడు పాతిక వేల రూపాయలు మంజూరు చేశారు. అది నేను కృష్ణారావుగారిని మొదటిసారి దర్శించడం”.





# 15 సమైక్యవాదిగా...

ఆంధ్ర రాష్ట్రంలోని 11 జిల్లాలను హైదరాబాద్ రాష్ట్రంలోని 9 తెలంగాణ జిల్లాలను విలీనం చేయటంతో 1956, నవంబరు 1వ తేదీన "ఆంధ్రప్రదేశ్" ఆవిర్భవించింది. కాకతీయుల కాలం నాడు ఏక ఖండంగా ఉన్న ఆంధ్రులంతా తిరిగి ఒకటైనారని దేశమంతా ఆనందించింది. ఇరు ప్రాంతాల వారి అపోహలను తొలగిస్తూ పెద్ద మనుష్యుల ఒప్పందం ఏర్పడింది.

13 ఏండ్ల తరువాత 1969లో తెలంగాణలోని కొందరు నేతలు తమ ప్రాంతానికి అన్యాయం జరిగిందంటూ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం బయులుదేరింది.

తెలంగాణ వారైన శ్రీ పి.వి. నరసింహారావును ముఖ్యమంత్రిగా చేయడంతో ఉద్యమం ఉధృతి తగ్గి పోయింది.

కానీ 1977లో ముల్కీ నిబంధనలు చెల్లుబాటవుతాయని సుప్రీం కోర్టు తీర్పుతో ఆంధ్ర ప్రాంతంలో అలజడికి కారణమై కొందరు ఆంధ్ర నేతలు "జై ఆంధ్ర" ఉద్యమాన్ని లేవదీశారు. సమైక్యవాదాన్ని గట్టిగా సమర్థించిన శ్రీ కృష్ణారావు ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చింది.



కృష్ణా జిల్లా నాయకులు ఆయనను ప్రత్యేక రాష్ట్ర వాదానికి మద్దతినిచ్చే విధంగా మార్చాలని విశ్వ ప్రయత్నం చేశారు. కానీ ఆయన తాను నమ్మిన బాటనే చివరి దాకా నిలిచారు. ఆయనపై కొన్ని అభాండాలు వేసినా చలించలేదు.

ప్రధానంగా ఇందిరాగాంధీ ఆరు సూత్రాల పథకం ప్రవేశం పెట్టడంతో ఆంధ్రప్రదేశ్ విచ్ఛిన్నం అయ్యే ప్రమాదం అప్పటికి తప్పిపోయింది.





# 16 గాంధేయ పథగామి

శ్రీ మండలి 1973 జులైలో తనకున్న 7 ఎకరాల 17 సెంట్లు భూమిని నిరుపేదలకు దానం చేస్తూ ప్రకటించారు. కొన్ని సభలలో తన స్థిర చరాస్తులను వెల్లడించారు. భారతదేశ రాజకీయ చరిత్రలో మొట్టమొదటిగా ఆస్తిపాస్తులను బహిరంగపరచినవారు శ్రీ మండలి.

పరిశుద్ధ గాంధేయవాది అయిన శ్రీ మండలి మహాత్ముని ధర్మ కర్తృత్వ సిద్ధాంతాన్ని జీర్ణించుకున్న మహనీయుడు.

ఆయనకు హైదరాబాద్ లో రెండుసార్లు హౌసింగ్ బోర్డు ఇళ్ళు కేటాయించింది. ఆయన సున్నితంగా నిరాకరిస్తూ "ప్రభుత్వ క్వార్టర్లలో ఉంటూ ఉన్నాం కదా! మనకు ఇల్లు ఎందుకు? మనం ఇల్లు వదులుకుంటే అది ఇల్లు లేనివారికి దక్కుతుంది" అని అన్నారు. అలాగే బంజారాహిల్స్ లో ఎం.ఎల్.ఎ. కాలనీలో కేటాయించిన ఇంటి స్థలాన్ని కూడా వదులుకున్నారు.

* * *



# 17 శ్రీ మండలి వారి భావజాలం

**"సొంత లాభం కొంత మానుకో**
**పొరుగు వారికి తోడు పడవోయ్"**

అనే గురజాడ వారి హితోక్తిని హైస్కూల్ విద్యార్థిగానే శ్రీ కృష్ణారావు ఆచరణలో పెట్టారు.

తోటి విద్యార్థులు రాత్రిపూట కిరోసిన్ కొరతతో దీపాలు లేక పాడుచున్న ఇబ్బందిని గమనించిన శ్రీ కృష్ణారావు గృహస్థుల నుండి, వ్యాపారస్తుల నుండి కిరోసిన్ సేకరించి మిత్రులకు అందజేసేవారు.

స్థిత ప్రజ్ఞుడైన శ్రీ కృష్ణారావు 1962లో బందరు పార్లమెంటు నియోజకవర్గానికి జరిగిన ఎన్నికలలో స్వల్ప మెజారిటీతో ఓటమి పాలయినారు. ఆయన నిరుత్సాహపడలేదు కదా క్రుంగిపోయిన శిష్య బృందంతో "కార్యకర్తలకు గెలుపేమిటి? ఓటమేమిటి? పదవీ వచ్చినా రాకున్నా మనకు దేశసేవకు అవకాశం ఉంటుంది సొంత ప్రయోజనాలు సాధించదలచిన వాళ్ళు ఓడిపోతే బాధ పడతారు. మన కెందుకు బాధ" అని నచ్చ చెప్పారు.

అలాగే 1962లో అవనిగడ్డ నుండి శాసనసభకు ఏకగ్రీవంగా ఎన్నికైనా ఆయన పొంగోపోలేదు. పైగా ముఖ్యమంత్రి "మీకు మంత్రిగా ఏ శాఖ కావాలంటే" సాంఘిక సంక్షేమ శాఖను కోరి వరించారు.

చరమ దశలో షిర్డీ సాయి బాబా పట్ల ఆకర్షితుడు కావడానికి కారణం ఆయన మాటలలోనే "బాబా జీవితంలో ఎక్కడా ఆడంబరాలు లేవు. సాటి మనిషితో ఎలా మెలగాలో చెప్పారు. మత సమన్వయం బోధించారు" అని చెప్పారు.

శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి 'శ్రీ మండలి ఒక మహా యంత్రం గాంధీక్షేత్ర మహా నిర్మాణం' అనే వ్యాసంలో "ఆయన ఇతరుల కొరకు నివసిస్తున్నాడు (He is living for others) అని నిర్ధారించాడు.



# 18 మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు

"తెలుగు మహాసభలు అనే ఒక ఆలోచనకు అంకురార్పణ చేసినవారు మండలి కృష్ణారావు గారు" అని డా. గౌరీ శంకర్ వ్రాశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1975, ఏప్రిల్ 12 నుండి 18 వరకు హైదరాబాద్ లోని లాల్ బహదూర్ స్టేడియంలో వైభవంగా జరిగాయి.

16 దేశాల నుండి 92 మంది ప్రతినిధులు, 9 ఇతర రాష్ట్రాల నుండి 981 మంది, తెలుగు జిల్లాల నుండి 4489 మంది పాల్గొన్నారు. ఇంగ్లీషులో తెలుగు వారి ప్రాభవాన్ని తెలిపే 78 చిరు పుస్తకాలు ప్రకటించారు. ఉదయం నుండి సాయంత్రం దాకా విద్వద్గోష్టులు, సదస్సులు, కవి సమ్మేళనాలు జరిగాయి. వివిధ రంగాలకు చెందిన 240 మంది ప్రముఖులు సన్మానింపబడ్డారు.

ఇంత భారీగా పూర్వం తెలుగు గడ్డపై ఏ సభలో జరిగి ఉండలేదు.

ఈ సభలను విజయవంతం చేసినమండలి వెంకట కృష్ణారావు గారిని వారి 50వ జన్మదినాన 1975, ఆగస్టు 4న ఘనంగా సన్మానించి ఆయన జీవితానికి అద్దం పట్టే విశేష సంచికను వెలువరించారు. ఈ మహాసభ తీర్మానాన్ని అనుసరించి మండలి వారు అధ్యక్షులుగా "అంతర్జాతీయ తెలుగు సంస్థ" ఏర్పాటయింది.

ఈ సంస్థ అధ్యక్షులుగా శ్రీ మండలి వారికి రాష్ట్రేతరాంధ్రులతో, విదేశాలలోని ఆంధ్ర సంఘాలతో చక్కని పరిచయం ఏర్పడింది. ప్రవాసాంధ్రుల సమస్యల పరిష్కారానికి ఇది దోహదమయింది.

శ్రీ కృష్ణారావు తన జీవితంలో రెండు సందర్భాలు తనకు అధిక సంతృప్తి నిచ్చాయని తెలుపుతూ అందులో మొదటిది తెలుగు మహాసభలు విజయవంతంగా నిర్వహించడం, తెలుగు వారందరిలో భావ సమైక్యతను పెంపొందించడానికి, రాష్ట్రాభ్యుదయ సాధనకు ఎంతో దోహదం చేశాయని నా విశ్వాసం అని వ్రాశారు. (రెండవది దివిసీమ ఉప్పెనలో ఆర్తజన సేవ.)

ప్రపంచ తెలుగు మహాసభలు దిగ్విజయంగా ముగియగానే డా. బెజవాడ గోపాలరెడ్డి నిర్వాహకులైన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, విద్యాశాఖా మంత్రి శ్రీ మండలి వెనకాత కృష్ణారావుగార్లను "నర నారాయణులు"గా అభివర్ణించారు.

★ ★ ★



# 19 ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు

1978లో జరిగిన ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ ఘన విజయం సాధించింది. డా. మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయినారు. ఆయన కాలంలో తెలుగు భాషాభివృద్ధికి ఏర్పడిన సంస్థలన్నీ నిర్వీర్యమైనాయి. శ్రీ కృష్ణారావు మిక్కిలి నిరాశ చెందారు.

1981, జనవరిలో ముఖ్యమంత్రిగా శ్రీ టి. అంజయ్య రాగానే శ్రీ కృష్ణారావు తనకు మంత్రి పదవి వద్దనీ అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్ష పదవిని కోరారు. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు తమ దేశంలో జరగాలని కౌలాలంపూర్ ఆంధ్రులు లోగడే కోరి ఉన్నారు.

1981, ఏప్రిల్ లో ఉగాది నాడు ప్రారంభించి నాలుగు రోజుల పాటు ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు కౌలాలంపూర్ లో జరిగాయి. శ్రీ పి.ఎస్.ఆర్. అప్పారావు గారు ప్రత్యేక అధికారిగా సభలను జయప్రదం చేశారు. కౌలాలంపూర్ సభలను గూర్చి విస్తృతంగా ప్రచారం జరిగింది. శ్రీ కృష్ణారావు గారి పలుకుబడి అనూహ్యంగా పెరిగింది. కొందరు కాంగ్రెస్ వారే అసూయతో మహాసభల నిర్వహణకు ద్రోహం తలపెట్టారు.



కౌలాలంపూర్ వెళ్తున్న కవులు, కళాకారులు మద్రాసులో విమానం ఎక్కే సమయానికి విద్రోహశక్తులు ప్రయాణీకులతో కలసిపోయి విధ్వంసం సృష్టించారు.

ఈ గొడవతో కృష్ణారావు గారు కలత చెందారు. తెలుగువారి పరువు బజారున పడింది.

శ్రీ కృష్ణారావు గారు తన ప్రయాణాన్ని విరమించుకున్నారు.

సాంస్కృతిక శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగార్లు సభల్లో పాల్గొని విజయవంతం చేశారు. కాని కృష్ణారావు గారు లేని లోటును అందరూ గుర్తించారు.





# 20 మూడవ ప్రపంచ తెలుగు మహాసభలు

1990, డిసెంబరు 10 నుండి 13 వరకు మూడవ ప్రపంచ తెలుగు మహాసభలు మారిషస్‌లో జరిగాయి.

అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్న డా. చెన్నారెడ్డి తాను మహాసభలకు వెళ్ళడం లేదనీ, మంత్రులు ఇతరులు కూడా వెళ్ళనవసరం లేదనీ ప్రకటించాడు. ఇంతలో మారిషస్ నుండి కూడా భారతదేశం నుండి ఆహ్వానింపబడిన పండితులు, కళాకారులు తమ దేశానికి రానక్కరలేదని టెలిగ్రాంలు వచ్చాయి.

కానీ డా. సి. నారాయణరెడ్డి పట్టుబట్టి సాంస్కృతిక బృందాలు వెళ్లి తీరవలసిందేనని, అందుకు ప్రభుత్వ అనుమతి కూడా సాధించారు. అనారోగ్య కారణంగా నిలిచి పోదలచిన శ్రీ కృష్ణారావు గారిని మిత్రులు పట్టుబట్టి మారిషస్ పంపారు. వారి అనారోగ్యం దృష్ట్యా కృష్ణారావు గారి కుమారుడు శ్రీ బుద్ధ ప్రసాద్ తండ్రి గారికి సాయంగా వెళ్ళాడు.

మహాసభలకు మూడు రోజులు ముందుగానే మండలి వారు డిసెంబరు 7న మారిషస్‌లో దిగారు. విమానాశ్రయంలో వారికీ అపూర్వ స్వాగతం లభించింది. డిసెంబరు 8న మారిషస్‌లోని ఇండియా హై కమీషనర్ ఇచ్చిన విందును స్వీకరించిన శ్రీ కృష్ణారావు బృందం మహాత్మాగాంధీ ఇన్‌స్టిట్యూట్‌లో వివిధ సాంస్కృతిక సంస్థల సన్మానాలను అందుకున్నారు. డిసెంబరు 8న మహా రామ భజన కార్యక్రమాన్ని తిలకించిన శ్రీ కృష్ణారావు బృందం డిసెంబరు 9న లాలేరాలో నిర్మించనున్న వెంకటేశ్వర దేవాలయ ప్రదేశాన్ని చూశారు.

డిసెంబరు 10న తెలుగు మహాసభలు నాదస్వరంతో ప్రారంభం కాగా మారిషస్ గవర్నరు, ప్రధానమంత్రి, ఇతర మంత్రులు, పార్లమెంటు సభ్యులు, నగరపాలక సంఘాల మేయర్లు, భారత హై కమీషనర్ పాల్గొన్నారు. శ్రీ కృష్ణారావు గారికి ఘన సన్మానం జరిగింది. 1990, డిసెంబరు 13న ముగింపు సభ వైభవంగా జరిగింది.

అక్కడి ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ సూరయ్య మండలి వారికి ఎన్నో జ్ఞాపికలను బహూకరించారు.

తమ మారిషస్ పర్యాటక విశేషాలను శ్రీ బుద్ధ ప్రసాద్ "మారిషస్ లో తెలుగుతేజం" అనే గ్రంథం వెలువరించారు.





# 21 మహా ప్రళయంలో ఆపన్న హస్తం

1977, నవంబరు 19వ తేదీ ఆంధ్రదేశ చరిత్రలో దుర్దినం. కోస్తా జిల్లాలు పెను తుపాను, ఉప్పెనలలో చిక్కుకున్న రోజు.

30 మైళ్ళ పొడవుతో, 24 అడుగుల ఎత్తున పొంగి పొరలిన సముద్ర కెరటాలు 12 వేల మంది ప్రజల మరణానికి దారి తీశాయి. లక్షలాది పశువులు చనిపోయాయి.

తుపాను భీభత్సం సందర్భంగా మండలి వారి సేవను శ్రీ తిరుమల రామచంద్ర కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు.

"తుపాను సంభవించిన నాడు కాకతాళీయంగా శ్రీ కృష్ణారావు అవనిగడ్డలో ఉన్నారు. అప్పుడాయన చేసిన సేవ సువర్ణాక్షరాలతో లిఖించదగినది.

గంటకు 200 మీటర్ల వేగంతో వీచే పెను గాలులలో హిందీ విద్యాలయం పిల్లలేమయ్యారో, సేవాశ్రమం, అనాథ శరణాలయం పరిస్థితి ఏమిటి అని విలపిస్తూ పరుగెత్తారు వారిని దక్కించుకుందామని. తెల్లవారింది. ఉప్పెన రాక్షసి ఎందరో ప్రజలను, ఎన్నో పశువులను సమూలంగా మింగిందని వార్తలు వ్యాపించాయి. ఒంటి మీద గుడ్డలు ఉన్నాయా లేవా అన్నది కూడా పట్టించుకోకుండా బయలుదేరారు. పాదచారియై కూలిపోయిన ఇండ్ల మధ్య నడిచారు. జల ప్రళయంలో మరుగయిపోయిన నారు పోగా మిగిలిన వారి మనస్సులలో బలం నింపడానికి నిలిచారు. ప్రజల హృదయాలలో నడిచారంటే సరిపోతుంది ఒక్క మాటలో. అంతటితో ఆగలేదు. ఆయన కనీవినీ ఎరుగని ఈ ఘోర కలి ప్రభుత్వానికి తెలియజేయాలి. ప్రభుత్వ సహాయ కార్యక్రమాలు వెంటనే ప్రారంభించాలి. అతి కష్టం మీద విజయవాడకు చేరారు. ప్రభుత్వ యంత్రాంగాన్ని కదిలించారు.

కాలిలో దాదాపు 36 ముళ్ళు గుచ్చుకున్నాయి. అయినా లక్ష్య పెట్టలేదు. కాలుకి కట్టు కట్టించుకున్నారు. నడక ప్రారంభించారు. విరామ మెరుగని నడక. పల్లె పల్లె తిరిగారు. పరిస్థితి చూశారు. పరితపించారు. పరితాపం పోగొట్టారు. చొరరాని ప్రాంతాలను హెలికాప్టర్ ద్వారా పరిశీలించారు. ఈ సహాయ సేవా యాత్రలో ఆయన చూడని పల్లె లేదు. మాట్లాడని మనిషి లేదు. ఆయన ఎన్నికల ప్రచారోద్యమానికి ఎన్నోమార్లు తిరిగారు. ఆ పర్యటనల పరిస్థితులు వేరు. ఉద్దేశం వేరు. ఈ యాత్ర అట్టిది కాదు. విషాద యాత్ర. పరామర్శ యాత్ర. పునరుజ్జీవన యాత్ర. ఇలా తుపానుకు గురి అయిన ప్రాంతాన్ని కాలికి బలపం కట్టుకొని తిరిగారన్న సామెతగా పలుమార్లు తిరిగారు. ప్రజల్లో విశ్వాసం నింపారు. ఇప్పుడు కావలసింది పునరుజ్జీవ పునర్నిర్మాణాలని ఉత్సాహ



పరిచారు. తక్షణమే చేయదగిన సహకారం చేశారు. చేయించారు. అవనిగడ్డ తుపాను బాధితుల శిబిరమయింది. ఆయనను కొన్నివేల మంది తుపాను బాధితులు అహమికతో, ఆత్రంతో తీసుకుని వచ్చారు. శిబిరానికి తుపాను బాధితులకు సహాయపడదామని వచ్చేవారికి ఆ శిబిర మొక పర్యాటక కేంద్రమయింది. యాత్రా స్థలమయింది.

శ్రీ మండలి నిర్విరామ కృషి వల్ల వందల కొలది స్వచ్ఛంద సంస్థలు ఉరుకులు పరుగులతో వచ్చాయి. ఆహారం, వస్త్రాలు అపారంగా అందజేశాయి. ఆయన చిత్తశుద్ధిని, అక్కడ హృదయవిదాకర పరిస్థితిని చూసిన వందల కొలది సేవా సంఘాలు చురుకుగా పని ప్రారంభించాయి. ఎటు చూసినా కనిపిస్తూ, ఎవరు చూసినా పలకరిస్తూ, ఏమి కోరినా అందజేస్తూ పరమాణువులోని సూక్ష్మాంశం లాగా తిరుగుతున్న శ్రీ మండలి సేన, ఉత్సాహాలు మూర్తీభవించిన శ్రీ మండలి ఆ సేవా సంఘాలకు రెట్టింపు మూడురెట్లు ఉత్సాహావేశాలు పోశాడు. ఇందు గల దందు లేడనే సూక్తి లాగా ఆయన కనిపిస్తూనే సేవ చేశారు. ఆయన వ్యక్తిత్వం అలాంటిది. కనుకనే రాష్ట్రపతి మొదలు నది వీధిలో నడిచే మనిషి వరకు, దేశంలోని సేవా సంస్థలు మొదలు అంతర్జాతీయ సేవా సంస్థల వరకు, స్థానిక పత్రికల నుంచి అంతర్జాతీయ పత్రికల వరకు ఆయన సేవా నిరతిని ప్రశంసించేవే.

1977, నవంబరు 19 వరకు తుపాను బాధితులను ఒక కంట కనిపెడుతూ వారి బాగోగులను చూస్తూ మంత్రి పదవి అవరోధమని రాజీనామా ఇచ్చారు. కానీ ముఖ్యమంత్రి అంగీకరించలేదు.

* * *

## గోపాలరెడ్డి నమస్కరించిన ఒకే మంత్రి

1980, మార్చిలో శ్రీ కృష్ణారావు గారికి ప్రభాకర్ జీ అవార్డు అందజేసిన సందర్భంలో డా. బెజవాడ గోపాలరెడ్డి ప్రసంగం ఇలా సాగింది.

“1920, డిసెంబరు 15న మొదటిసారిగా మంత్రి వర్గం ఏర్పడింది. ఈ అరవై ఏళ్ళల్లో కొన్ని వందలమంది మంత్రులయి ఉండవచ్చు. కాని హృదయపూర్వకంగా ఏ మంత్రికైనా నమస్కారం చేస్తానంటే ఒక్క మండలి కృష్ణారావునే చెప్తాను. ఎందుకంటే ఆయన ఉపన్యాసాలతో ఆర్తిని తీర్చేవారు కారు. కష్టపడి కాళ్ళకు పుండ్లు ఏర్పడినప్పటికీ మైళ్ళకు మైళ్ళు నీళ్ళలో నడుస్తూ, ఆ శవాల మధ్య తిరుగుతూ ఆయన సేవ చేశారు. ఆ మాదిరిగా సేవ చేసిన రాజకీయవాదులు మంత్రివర్యులు అట్టే మనకు లేరు”.

శ్రీ కృష్ణారావు తన జీవితంలో తనకు తృప్తి నిచ్చిన సందర్భాలలో “తుపాను బాధితుల సేవ” రెండవది అని తెలిపారు. (మొదటిది ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ)



# 22 ప్రభాకర్ జీ - మండలి కుటుంబం

1977, నవంబరు 19న సంభవించిన దివిసీమ మహా ప్రళయం గూర్చి తెలుసుకున్న గాంధీజీ అంతేవాసి ప్రభాకర్ జీ మరునాడు సాయంకాలాని కల్లా అవనిగడ్డ వచ్చి వాలారు.

ఆనాటి నుండి దివిసీమ కుదుటబడే దాకా అక్కడే మకాం పెట్టిన ప్రభాకర్ జీ మండలి కుటుంబంలో ఒక సభ్యుడై పోయారు. తమ ప్రాణాలకు తెగించి సహాయ కార్యక్రమాలు అందించిన వారుగా శ్రీ మండలి, శ్రీ ప్రభాకర్ జీ గార్లనే తల్లాప్రగడ ప్రకాశరాయుడు వ్రాశారు.

ప్రభాకర్ జీని కృష్ణారావు తన అగ్రజునిగా భావిస్తే, ప్రభావతీ దేవి తన తండ్రిగా భావించింది. 20 ఏండ్ల బుద్ధ ప్రసాద్ తన గురువుగా భావించి శుశ్రూష చేశాడు.

ప్రభాకర్ జీని వెన్నంటి సంచరించిన శ్రీ కృష్ణారావు ఆయన గావించిన సేవలను గూర్చి ఇలా తెలిపారు.

"ఉప్పెన బాధితుల అవసరాలను తీర్చడంలో ప్రభాకర్ జీ చూపిన నైపుణ్యం, శ్రద్ధ ప్రజల హృదయాలలో ఆయనకు స్థిరమైన చోటు కలిగించింది.

రాత్రింబవళ్ళు గ్రామాలకు వెళ్లి ప్రజల అవసరాలను స్వయంగా తెలుసుకునేవాడు. తీవ్రంగా కృషి చేసి ప్రజలకు ఏదో సాయం అందజేసేవాడు. తిండి సామాగ్రి, గుడ్డలు, దుప్పట్లు, ఇండ్ల తాలూకు కలప వగైరా, పాలపొడి, రవ్వ, బిస్కట్లు, పాత్రలు, బక్కెట్లు, పెట్టెలు, దీపాలు, ఉప్పు, చింతపండు, మిరపపొడి ఇలాంటివి అందజేసేవాడు.

కుట్టు మిషన్లు పంచి పెట్టాడు. వ్యవసాయదార్లకు నాగళ్ళు, కాడిమానులు, పారలు, ఇనుప బొచ్చెలు పంచి పెట్టాడు. దేవాలయాలకు తాళాలు ఏలాలు పంపించి సీతారామ కళ్యాణాలు చేయించాడు. అనాథ స్త్రీలను, భార్యలను, భర్తలను కోల్పోయిన వారికి వివాహాలు చేయించాడు. అను దినము కొత్త కార్యక్రమాలు నిర్వహించాడు ప్రభాకర్ జీ. అలసట, విసుగు, కోపము లేవు. ఉప్పెనలో వరద నీరు తగ్గిన తర్వాత మృత కళేబరాలను తొలగించడానికి ఎందరో కార్యకర్తలను సమీకరించి "శవసేన" పేర దహన/ఖనన కార్యకలాపాలు సాగించాడు. ప్రభాకర్ జీ తాను స్వయంగా రంగంలోకి దిగి పొడుగు పాటి కర్ర చేతబూని శవాలను తొలగించడంలో ముందు నిలిచాడు.

ప్రభాకర్ జీ గావించిన కార్యక్రమాలన్నిటిలో కుడి భుజంగా నిలిచిన శ్రీ కృష్ణారావు గారిని "దివిసీమ గాంధీ" అంటూ ప్రజలు జేజేలు పలికారు.



శ్రీ కృష్ణారావు సతీమణి శ్రీమతి ప్రభావతీ దేవి ప్రభాకర్ జీని తండ్రి లాగా సేవించింది. ఆయనకు, ఆయన సన్నిహితులకు ప్రత్యేకంగా ఆహారం వండి పంపేది. పని వ్యాపకంలో ప్రభాకర్ జీ అన్నం విషయం మరిచిపోయినప్పుడు ఆయన ఉన్న చోటికి అన్నం తీసుకుని పోయి పెట్టేది.

ఒకసారి ప్రభాకర్ జీని అపాయం నుండి కాపాడింది.

ప్రభాకర్ జీ బృందం ఒక కాలువ దాట వలసి వచ్చింది. ఆ బృందంలో ప్రభావతీ కూడా ఉంది. కాలువ దాటటానికి ఒక తాటి బుగ్గ మాత్రమే ఆధారంగా ఉంది. ఆమె ప్రభాకర్ జీ కంటే ముందుగా సులువుగానే కాలువ దాటి ఆవలి ఒడ్డున ఆయన కోసం ఎదురు చూస్తున్నది.

బృందంలోని ఇతరులు చాలా దూరంలో ఉన్నారు. ప్రభాకర్ జీ తాటి బుగ్గ మీదకు వచ్చేసరికి కళ్ళు తిరిగి తూలి పడబోయాడు. "ప్రభావతీ నేను పడబోతున్నాను" అని బిగ్గరగా కేక వేశాడు. ప్రభావతి సమయస్ఫూర్తితో అక్కడ దొరికిన వెదురు వాసాన్ని ఆయనకు అందించింది. అది ఆసరాగా ప్రభాకర్ జీ కాలువ దాటి ప్రభావతిని మిక్కిలి అభినందించాడు.

20 ఏండ్ల యువకుడైన బుద్ధ ప్రసాద్ తండ్రి బాటలో పయనిస్తూ ఉప్పెన బాధితుల సహాయ కార్యక్రమాలలో వారికి బాసటగా నిలిచాడు. సంఘసేవలో ప్రభాకర్ జీని తన గురువుగా భావించాడు.









# 23 తొలి విదేశీ పర్యటన

1970లో శ్రీ మండలి వారు అవనిగడ్డ సమితికి అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు. అప్పటికే ఆయన ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా, రోడ్డు రవాణా సంస్థ పాలక మండలి సభ్యులుగా ఉంటూ మూడు పదవులకు న్యాయం చేశారు.

ఈ కాలంలోనే వారికి ఆగ్నేయ ఆసియా దేశాలు పర్యటించే అవకాశం లభించింది. 1970, సెప్టెంబరు 25న ప్రారంభమైన విదేశీ యాత్ర 25 రోజులు సాగింది.

విదేశాలలో కూడా యాన ఎప్పటిలాగా ఖద్దరు పంచె, చొక్కా ధరించి సంచారం చేశారు. పిలిప్పైన్స్ లో ఉన్నప్పుడు వీరిని ఒక యోగిగా భ్రమ పడ్డారు.

బ్యాంకాక్ లో ఈ వస్త్రధారణ ఉండటం మూలంగానే ఆయనకు మరకత శిలతో చెక్కబడిన బుద్ధ విగ్రహ దర్శనం వీలయింది. జపాన్ ప్రజల చిత్తశుద్ధికి, క్రమశిక్షణకు శ్రీ మండలి ముగ్ధుడైనారు.

సింగపూర్ పారిశుద్ధ్య విధానం ఆయనకు ఎంతగానో నచ్చింది.

కౌలాలంపూర్ లో స్థిరపడిన తెలుగువారికి మన భాష, సంస్కృతుల పట్ల గల ఆసక్తి ఆయనను ముగ్ధుణ్ణి చేసింది.

ప్రపంచ తెలుగు మహాసభలు జరిపి వీరందరినీ స్వదేశానికి రప్పించాలనే ఊహ శ్రీ మండలి వారికి ఆనాడే కలిగింది.





# 24 మండలి వారి విశ్వ పర్యటన

మారిషస్ దేశంలో స్థిరపడిన భారతీయులలో హిందీ భాష మాట్లాడే వారి సంఖ్య ఎక్కువ. మారిషస్ లో పోర్ట్ లూయిస్ సమీపాన గల మోకా ప్రాంతంలో 1976, ఆగస్టు 28 నుండి 3 రోజుల పాటు రెండవ ప్రపంచ హిందీ సమ్మేళనం జరిగింది.

భారత ప్రభుత్వ ప్రతినిధిగా శ్రీ మండలి వారు ఆ సభల్లో పాల్గొన్నారు. ఆగస్టు 23 నుండి 31 వరకు మలేసియాలో విస్తృతంగా పర్యటించారు. అక్కడ తెలుగువారు నివసిస్తున్న పల్లెలను, పట్టణాలను చూడటానికి 1,141 మైళ్ళ దూరం తిరిగారు. ఆంధ్ర మహాసభ కేంద్రాలను దర్శించారు. దాదాపు 40 సమావేశాలలో ప్రసంగించి వారి యోగక్షేమాలను విచారించారు. మారిషస్ జాతిపిత, ప్రధానమంత్రి సర్ శివసాగర్ రామగులామ్ తో శ్రీ మండలి జరిపిన చర్చల ఫలితంగా మహాత్మా గాంధీ సంస్థాన్ లో తెలుగు పరిశోధనకు అవకాశం కల్పించారు.

## కృతజ్ఞతా యాత్ర

1977 నవంబరులో దివిసీమ ఉప్పెన సందర్భంగా సాయం అందించిన విదేశీ స్వచ్ఛంద సంస్థల వారికి కృతజ్ఞత తెలుపడానికి శ్రీ మండలి వారు యూరప్, కెనడా, అమెరికా దేశాలలో పర్యటించారు.

వారు పాల్గొన్న ప్రతి సభకు తెలుగువారు అధిక సంఖ్యలో ఉత్సాహంగా పాల్గొన్నారు. గొప్ప సంఘ సంస్కర్త రాజా రాం మోహన్ రాయ్ 1833, సెప్టెంబరు 23న ఇంగ్లండులో బ్రిష్టన్ నగరంలో మరణించారు. వారి 150వ వర్ధంతి 1983, సెప్టెంబరు 27న జరుపుతూ అందులో పాల్గొనవలసినదిగా బ్రిష్టన్ నుండి శ్రీ మండలికి ఆహ్వానమ అందింది.

ఈ అవకాశాన్ని పురస్కరించుకుని శ్రీ మండలి కృష్ణారావు సెప్టెంబరు 18న ఢిల్లీలో బయలుదేరి ముందుగా పశ్చిమ జర్మనీ చేరి అక్కడ 3 రోజులు గడిపారు.

19వ తేదీన దివిసీమ పునర్నిర్మాణంలో తోడ్పడిన డా. డైక్ మెన్ దంపతులనుదర్శించి వారికి కృతజ్ఞతలు తెలిపి కలంకారీ దుప్పట్లను బహూకరించారు.

డైక్ మెన్ దంపతులు భావదేవరపల్లిలో 80 ఇళ్ళు నిర్మించి ఇచ్చారు. అవనిగడ్డలో టెక్నికల్ ఇన్స్టిట్యూట్ స్థాపించారు. సెప్టెంబరు 20న లండన్ చేరిన శ్రీ మండలి వారు వివిధ పట్టణాలు దర్శించారు. 22న అవనిగడ్డ క్షేత్రంలో మోడల్ మిక్స్ ఫారమ్ స్థాపనకు సాయపడిన క్రిస్టియన్ ఎయిడ్ లండన్ నిర్వాహకులను కలసి కృతజ్ఞతలు తెలిపి



బహుమతుల నిచ్చారు. తర్వాత బ్రిష్టన్ లో రాజా రాం మోహన్ రాయ్ సమాధిపై పుష్ప గుచ్ఛం ఉంచి నివాళు లర్పించారు. తెలుగు కవులు ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్ ఆ సమయంలో అక్కడే ఉండడం విశేషం. బర్మింగ్ హాం, ప్రిష్టన్ నగరాలలో తెలుగువారిని కలుసుకుని యోగక్షేమాలు తెలుసుకున్నారు.

1983, అక్టోబరు 2న రోమ్ లో గాంధీజీ జయంతి ఉత్సవంలో పాల్గొన్నారు. అక్కడ వారికి గాంధీజీ చిత్ర పటాన్ని బహూకరించారు. తరువాత కెనడా వెళ్ళిన శ్రీ మండలి వారు దివిసీమ పునరుద్ధరణకు తోడ్పడిన కెనడియన్ బాప్టిస్టు ఫెడరేషన్, రెడ్ క్రాస్ మొదలగు సంస్థలను కలసి కృతజ్ఞతలు తెలిపారు.

అమెరికాలో

కెనడా పర్యటన పిమ్మట శ్రీ మండలి వారు అక్టోబరు 16న అమెరికాలోని ఇండియానా పాలిష్ చేరారు. పోర్టు లేక్ లో తెలుగువారిని కలుసుకున్నారు. లాస్ ఏంజిల్స్, సెయింట్ లూయిస్, శాన్ ఫ్రాన్సిస్కో, క్లీవ్ లాండ్ లలోని తెలుగువారిని కలుసుకున్నారు.

చికాగోలో అయిదు వందల మంది ఆంధ్రులు చేరిన సభలో తెలుగు సినిమా ప్రదర్శించారు. నోబెల్ బహుమతి విజేత శ్రీ సుబ్రహ్మణ్య చంద్రశేఖర్ ను అక్కడే దర్శించారు. హూస్టన్, టెక్సాస్ లను దర్శించి శ్రీమతి రత్నపాప, శ్రీమతి ఉమాభారతిలు నడుపుతున్న నృత్య పాఠశాలలను దర్శించారు. వాషింగ్టన్ లో ఆంధ్ర సంఘం వారిని కలసి, తుపాన్ సమయంలో వారు అందించిన సహాయానికి కృతజ్ఞతలు తెలిపారు. పిట్స్ బర్గ్, డెట్రాయిట్ లలో పర్యటించి అక్కడి తెలుగువారిని అభినందించారు.

★ ★ ★





# 25 మలేషియా ఆంధ్ర సంఘం తెలుగుదాత బిరుదు ప్రదానం

మలేసియాలో 1981 ఏప్రిల్ లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు ఆశించిన తృప్తిని కలిగించ లేదని అక్కడ ఆంధ్ర సంఘం భావించింది.

శ్రీ మండలి వారు ఆ సభలలో పాల్గొనకపోవడమే అలా జరిగాయని అక్కడి వారి అభిప్రాయం.

శ్రీ మండలి వారిని ఉగాది ఉత్సవాల సందర్భంగా ప్రత్యేకంగా ఆహ్వానించారు. మలేసియా జనాభాలో 50 శాతం మాలె వారి తర్వాత 40 శాతం చైనీయుల తర్వాత తమిళులు 8 లక్షలు కాగా తెలుగువారి జనాభా 1.5 లక్ష.

తెలుగు సంఘం ఆహ్వానం మేరకు శ్రీ మండలి బృందం మలేసియాలో 1984, మార్చి 31 నుండి ఏప్రిల్ 25 వరకు పర్యటించింది.

ఈ బృందంలో శ్రీమతి మండలి ప్రభావతీ దేవి, సాహితీవేత్త శ్రీ పి.ఎస్.ఆర్. అప్పారావు, మిమిక్రీ కళాకారుడు శ్రీ నేరెళ్ళ లక్ష్మణరావు ఉన్నారు.

ఆంధ్ర సంఘం వీరి బసకు అంతర్జాతీయ స్థాయి హోటల్ ప్రతిపాదించగా శ్రీ మండలి వారు సున్నితంగా తిరస్కరించి తాము సోదరుల ఇండ్లలో అతిథులుగా ఉంటామనీ, పూలమాలలు వేయటం లాంటి ఆర్భాటాలు చేయవద్దనీ వారికి ముందుగా తెలిపారు.

మలేసియాలో తెలుగువారు, వారి పిల్లలు తెలుగు నేర్చుకొనుటకు అవసరమయిన పాఠ్య గ్రంథాలు, తెలుగు పండుగలు, పబ్బాల గూర్చి తెలిపే గ్రంథాలు గాని లేవని శ్రీ మండలి వారికి విన్నవించారు. శ్రీ పి.ఎస్.ఆర్. అప్పారావు మన సంప్రదాయల గూర్చి, శ్రీమతి ప్రభావతీ దేవి మన పండుగ, పబ్బాల గూర్చి అక్కడి తెలుగు వారికి వివరించి వారి ప్రశంసలందుకున్నారు.

శ్రీ నేరెళ్ళ లక్ష్మణరావు గొప్ప వారి కంఠ ధ్వనులను అనుకరించి చేసిన మిమిక్రీ అక్కడి ఆంధ్రులను మిక్కిలి ఆకట్టుకున్నది.

మలేసియాలోని సింపాంగ్ అంపాట్ శాఖ వారు శ్రీ మండలి కృష్ణారావుగారికి "తెలుగు దాత" అని బిరుదు నిచ్చి గౌరవించారు.

* * *



# 26 సాహితీ బంధువు

సాధారణంగా రాజకీయవేత్తలలో సాహిత్యాభిలాష ఉండటం అరుదుగా చూస్తాం. ఈ సూత్రానికి అపవాదుగా శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ పి.వి. నరసింహారావు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ మండలి వెంకట కృష్ణారావుగార్లు కనిపిస్తారు.

హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న డా. బూర్గుల రామకృష్ణారావు సచివాలయంలో తన ఉద్యోగ ధర్మం ముగిసిన తర్వాత కవితలు, అనువాదాలు అనేకం చేసినట్లు చెప్తారు.

ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ పి.వి. నరసింహారావు ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 1972, ఆగస్టు 15న స్వాతంత్ర్య దినోత్సవ రజతోత్సవ సందర్భంగా అర్థరాత్రి తెలుగులో దీర్ఘ కవితాగానం చేసి సభ్యులను ఆశ్చర్యపరచారు.

డా. బెజవాడ గోపాలరెడ్డిగారు 1957లో ప్రారంభింపబడిన ఆంధ్ర సాహిత్య అకాడెమీకు అధ్యక్షులుగా చిరకాలం పనిచేసి వందల కొద్దీ సాహితీ కార్యక్రమాలలో పాల్గొన్నారు. శ్రీ రెడ్డి స్వయంగా కవి, అనువాదకుడు, విశ్వకవి ఠాగూర్ అంతేవాసి.

శ్రీ మండలి వెంకట కృష్ణారావు సాహితీ పిపాసి. రసజ్ఞుడు. కవి పండిత పక్షపాతి. ఆంధ్రదేశంలోని ప్రముఖ కవులు, రచయితలకు తలలో నాలుక.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రచనల్లో తలమానికమైన "రామాయణ కల్పవృక్షం"లో శ్రీ మండలి వారిని శ్రోతగా పేర్కొన్నారు. ఆ సందర్భంగా వ్రాసిన పద్యం:

**ఆయన జూచిన నేనె**
**యాయన యనిపించె హృదయమందు నదేలో**
**ఆయన ప్రకృతియు నాయది**
**మాయురె యొక జాతి ద్రవ్యమా యనిపించున్**

చరమకాలంలో కూడా విశ్వనాథ వారు శ్రీ మండలి వారిని చూడాలనే కోర్కె వెలిబుచ్చారు. శ్రీ మండలి వారి జీవితంలో జరిగిన ఒక సంఘటన శ్రీ సి. నారాయణరెడ్డి 'రిక్షా'వానిపై కవిత అల్లటానికి స్ఫూర్తి నిచ్చింది.

ఒకసారి శ్రీ మండలి వారు కారు దిగి విదేశీ ప్రతినిధులను పలుకరించి బయటకు రాగా తన కారు వెళ్లిపోయినట్లు గమనించారు. మరొక ఆలోచన లేకుండా ఒక రిక్షాను పిలిపించి అందులో ఎక్కి వెళ్ళిపోయారు. అప్పుడు సి.నా.రె.



**రింఝుం రింఝుం హైదరాబాద్**
**రిక్షావాలా జిందాబాద్**
**మూడు చక్రములు గిరిగిర తిరిగితే**
**మోటరు కారు బలాదూర్**
అని వ్రాశారు.

మహాకవి రాయప్రోలు సుబ్బారావు 85వ జయంతికి శ్రీ మండలి సకుటుంబంగా వెళ్లి రాయప్రోలు వారిని వస్త్రాలతో సత్కరించి ఆశీస్సులు పొందారు.

1977లో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి శ్రీ మండలి సంక్రాంతి శుభాకాంక్షలు పంపగా శ్రీ శాస్త్రిగారు మిక్కిలి ఆనందించారు. శ్రీ మండలి వారి కుమార్తె అన్నపూర్ణాదేవి వివాహానికి ప్రముఖ రచయిత శ్రీ చలం గారు రమణాశ్రమం నుండి ఆశీస్సులు పంపారు. వచన కవితా పితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు శ్రీ మండలి వారికి వ్రాసిన సుదీర్ఘ లేఖలో తన భావాన్ని వ్యక్తం చేయటానికి క్రింది ఇంగ్లీషు వాక్యం జొప్పించారు.

"I am really very much impressed with యువర్ behavour as a MAN. వారి పేరులో మానవతా లక్షణమూ, సౌశీల్యం, వినమ్రతలు నాకు నచ్చినవి అంటూ లేఖ ముగించారు.

అన్నపూర్ణాదేవి వివాహ సందర్భంగా కుందుర్తి "ఈ శుభవేళ" అని అద్భుత కవిత వ్రాశారు.

"కవి పాదుషా" పువ్వాడ శేషగిరిరావు శ్రీ మండలి వారికి ప్రత్యక్ష గురువు. 1974 గురుపూజ దినోత్సవంగా వారిని సత్కరించి ఆశీస్సులందుకున్నారు.

★ ★ ★



# 27 మహితాత్ముడు

నవయుగ వైతాళికుడు కందుకూరి వీరేశలింగం గారిని గూర్చి చిలకమర్తి కవీంద్రులు వ్రాసిన పద్యంలో...





**"తన దేహము తన గేహము**
**తన దేహము తన సర్వస్వం"**

ప్రజలకే అర్పించిన ఘనుడని ప్రశంసించారు. శ్రీ మండలి కృష్ణారావు గారికి కూడా ఈ పద్యంలోని భావం సంపూర్ణంగా అన్వయిస్తుంది.

మండలి కృష్ణారావుగారి తండ్రి వెంకట్రామయ్యగారు గొప్ప రామ భక్తుడు. పులిగడ్డ నుండి భద్రాచలానికి ఆయన శ్రీరామనవమికి భజన చేసుకుంటూ వెళ్ళారట.

శ్రీ కృష్ణారావుగారి ఆరాధ్య దైవం మాహాత్మా గాంధీ రామభక్తుడే!

కాగా శ్రీ కృష్ణారావు "మానవ సేవే మాధవ సేవయ"ని భావించిన "కర్మయోగి". బహిర్గతంగా భక్తి ప్రదర్శనలు వెల్లడించకపోయినా శ్రీ కృష్ణారావులో భగవదారాధన భావం పుష్కలంగా అంతర్గతంగా ఉండిపోయింది. మాతృశ్రీ జిల్లెళ్ళమూడి అమ్మ, సత్యసాయి బాబాలలో మానవసేవా దృక్పథాన్ని కొనియాడారు.

శ్రీ కృష్ణారావు వ్యక్తిత్వాన్ని గూర్చి మలేసియా ఆంధ్ర సంఘం కార్యదర్శి శ్రీ మదిని సోమనాయుడు ఈ విధంగా తెలిపాడు.

"శ్రీ మండలి వారు స్నానం చేసిన వెంటనే ఒక మూలకు వెళ్లి ఏదో ధ్యానం చేసి పూలు వేయటం ఒకరోజు చూశాను. ఎవరికీ ధ్యానం అని పరికించగా ఆ మూలలోని గౌతమ బుద్ధుని ఛాయాచిత్రం, గాంధీ మహాత్ముని ఛాయాచిత్రం ఉండటం చూసి ఆశ్చర్యపోయాను. శ్రీ మండలి నాస్తికులు కారు. దైవం పట్ల నమ్మకం కలవారే! కానీ మానవ సేవయే మాధవ సేవ అన్న సిద్ధాంతం గల వ్యక్తి".

మండలి వారు తన తల్లి చనిపోయినప్పుడు ఆచారం ప్రకారం గోదానం చేయాల్సి ఉండగా ప్రత్యామ్నాయంగా అరవై మంది హరిజన స్త్రీలకు చీరలు పంచిపెట్టడం Good deeds are the best prayer అనే సూక్తికి ప్రబల ఉదాహరణ.

* * *



# 28 అవనిగడ్డలో ఆఖరి కార్యక్రమం

నిర్విరామంగా సమాజసేవ గూర్చి ఆలోచించే శ్రీ మండలి వారు చరమ దశలో షిర్డీ సాయి అంకిత భక్తుడుగా మారడం ఆశ్చర్యకరం!

ఒకనాడు శ్రీమతి ప్రభావతీదేవి, వారి అల్లుడు డా. కోటేశ్వరరావుగార్లు షిర్డీ సాయిని గూర్చి చర్చించుకోవటం గమనించారు కృష్ణారావు.

"గాంధీజీ వీర భక్తులయిన మీరు ఆయన రామ భక్తి ఎందుకు స్వీకరించ లేదో అర్థం కాలేదు" అని శ్రీమతి ప్రభావతీదేవి అన్నారు.

ఇంతలో డా. కోటేశ్వరరావు మామగారితో ముచ్చటిస్తూ శ్రీ షిర్డీ సాయి చరిత్ర చదవండి అంటూ ఒక గ్రంథాన్ని శ్రీ మండలి వారి చేతుల్లో పెట్టారు.

పది రోజుల తర్వాత మండలి వారు ఏలూరు వెళుతూ హనుమాన్ జంక్షన్ లో ఆగి "కోటేశ్వరరావు! మనం అవనిగడ్డలో షిర్డీ సాయి గుడి కడదాం అన్నాడు. ఆ మాట విని ఆశ్చర్యపోయిన డాక్టరు గారితో శ్రీ మండలి "బాబా జీవితంలో ఎక్కడా ఆడంబరాలు లేవు. సాటి మనిషెలా మెలగాలో చెప్పారు. మత సమన్వయం బోధించారు" అని అన్నారు. అంతకు ముందు ఎవరినీ విరాళం అడుగని శ్రీ సాయిబాబా మందిరానికి పలువురిని అడిగి విరాళాలు సేకరించారు. సాయిబాబా విగ్రహాన్ని జైపూర్ నుండి తెచ్చి ప్రతిష్ఠించారు.

సాయిరాం స్మరణతో తనువు చాలించి 1997, సెప్టెంబరు 27న సాయిబాబాలో ఐక్యమైపోయినారు.



# 29 స్మృతి చిహ్నాలు




శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి జీవిత ఆశయాలలో కృష్ణానదిపై పులిగడ్డ–పెనుమూడి వంతెన నిర్మాణం సాధించడం ఒకటి.

దీనికోసం రెండు దశాబ్దాలుగా శ్రీ కృష్ణారావు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను ఒప్పించడానికి ఎంతగానో ప్రయత్నించారు.

చివరకు ఆయన మరణానంతరం ఆయన కుమారుడు బుద్ధ ప్రసాద్ పట్టుదలతో సాధించిన వంతెనకు “మండలి వెంకట కృష్ణారావు వారధి” అని పేరు పెట్టారు.

నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలనే వారి రెండవ కోరిక కూడా 2012 డిసెంబరులో తిరుపతిలో జరిగిన మహా సభలతో తీరినట్టయినది.

తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమయిన అంతర్జాతీయ తెలుగు సంస్థకు “మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు సంస్థ”గా పేరు పెట్టారు. వారి స్మారకార్థం ప్రతి ఏటా విదేశాలలో తెలుగు భాష కోసం కృషి చేసే వారికి ఒకటి రాష్ట్రేతర ప్రాంతాలలో ఉన్న ఆంధ్ర సంస్థలకు బహుమతు లివ్వబడుతున్నాయి.

భారతదేశంలోనే మొట్టమొదటగా శ్రీ వెంకటేశ్వర పశు వైద్య విశ్వవిద్యాలయం వారు భావదేవరపల్లిలో స్థాపించిన “మత్స్య పాలిటెక్నిక్ కళాశాల”కు మండలి వెనకాత కృష్ణారావుగారి పేరు పెట్టడం జరిగింది.





# 30 తండ్రీ కొడుకులు

'The child is the father of the man' అన్న సూక్తి ప్రచారంలో ఉంది. సంస్కృతంలో కూడా 'ఆత్మావై పుత్ర నామాసి' అన్న సూక్తి కూడా అలాంటి భావమే తెలుపుతుంది.

తానూ తన తండ్రీ ఒకటే (I and my father are one) అని ఏసు ప్రభువు వాక్కు.

తండ్రి వారసత్వం పుణికి పుచ్చుకున్న ప్రముఖులలో ఉత్తరదేశంలో భగవాన్ దాస్ ఆయన కుమారుడు శ్రీ ప్రకాష్ గార్లను చెప్తూ ఉంటారు. మరొక ఉదాహరణ నెహ్రూలు.

1929, డిసెంబరులో లాహోరు కాంగ్రెస్ మహాసభలలో మోతీలాల్ నెహ్రూ నుండి అధ్యక్ష పదవిని ఆయన కుమారుడు జవహర్ లాల్ నెహ్రూ స్వీకరించారు. ఇదొక అపూర్వ సంఘటన. A noble son of an able father అని దేశమంతా కొనియాడింది.

ఆంధ్రదేశంలో వరాహగిరి జోగయ్య పంతులు వారి కుమారుడు వి.వి. గిరిగార్లు ఉన్నత శ్రేణి నాయకులుగా గౌరవింపబడినారు.



ఇటీవలి కాలంలో అలాంటి అపూర్వ గౌరవం శ్రీ మండలి వెంకట కృష్ణారావు, బుద్ధ ప్రసాద్ గార్లకు లభించింది.

తండ్రి చాటు బిడ్డగా 20 సంవత్సరాల వయస్సులోనే తండ్రిని అనుసరిస్తూ ప్రజా సేవారంగంలో దిగిన మండలి బుద్ధ ప్రసాద్ తండ్రి సుగుణాలయిన నిరాడంబరత, మిత భాషణం, ప్రియ భాషణం, సంఘ సేవానురక్తి, సాహితీ పిపాసలను పుణికి పుచ్చుకున్నారు.

తండ్రి జీవిత కాలంలో సాధించలేకపోయిన పనులన్నీ కుమారుడు పట్టుదలతో సాధించి పితృ రుణం తీర్చుకుంటూ తెలుగు ప్రజల అభివృద్ధికీ, తెలుగు భాషా వ్యాప్తికీ నిరంతరం శ్రమించటం తెలుగు వారి అదృష్టమని చెప్పాలి.

★ ★ ★



# మండలి జీవిత ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1. | జననం | 4.8.1926 |
| 2. | ప్రాథమిక విద్య | 1939–1945 |
| 3. | బందరులో కళాశాల విద్య | 1946–1951 |
| 4. | వివాహం<br>(భోగాది వెంకట్రామయ్య గారి కుమార్తె ప్రభావతీదేవితో) | 19.5.1952 |
| 5. | ఆంధ్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి | 1956–58 |
| 6. | బందరు నుండి పార్లమెంటుకు ఎన్నిక | 1957–62 |
| 7. | కృష్ణాజిల్లా పరిషత్ ఉపాధ్యక్ష పదవి | 1963–69 |
| 8. | అవనిగడ్డలో గాంధీక్షేత్రం ప్రారంభం | 1969, అక్టోబరు |
| 9. | అవనిగడ్డ సమితి అధ్యక్షులుగా ఏకగ్రీవ ఎన్నిక<br>ఆగ్నేయాసియా దేశాల పర్యటన | 1970 |
| 10. | అవనిగడ్డ నుండి శాసనసభకు ఏకగ్రీవ ఎన్నిక<br>సాంఘిక సంక్షేమ మంత్రి పదవి | 1972, ఫిబ్రవరి |
| 11. | 5 ఎకరాల భూదానం | 30.06.1973 |
| 12. | విద్యాశాఖా మంత్రిగా ప్రమాణస్వీకారం | 12.1.1974 |
| 13. | అధికార భాషగా తాలూకా స్థాయిలో ప్రకటన<br>అఖిల భారత సాంస్కృతికోత్సవాలు | 1974, ఉగాది |
| 14. | బాలలకు ఉత్సవాలు | 1974, దసరా |
| 15. | మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు | 12.4.1975 నుండి<br>వారం రోజులు |
| 16. | 50వ జన్మదినోత్సవం | 4.8.1975 |
| 17. | అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భావం | 6.9.1975 |
| 18. | దివిసీమ మహా ప్రళయంలో ఆపన్నహస్తం | 1977 నవంబరు నుండి |
| 19. | కృతజ్ఞతా విదేశయాత్ర | 1983, అక్టోబరు |
| 20. | మలేసియా పర్యటన, 'తెలుగు దాత' బిరుదు | 1984, మార్చి |
| 21. | మారిషస్ లో 3వ ప్రపంచ తెలుగు మహాసభలు | 1990, డిసెంబరు |
| 22. | పరమపదం | 27.9.1997 |



# ఉపయుక్త గ్రంథాలు


1. మానవ మాణిక్యం మండలి వెంకట కృష్ణారావు
   రచన డా. గంధం సుబ్బారావు — ఎమెస్కో ప్రచురణ

2. గాంధీజీ అంతేవాసి ప్రభాకర్ జీ
   రచన రావినూతల శ్రీరాములు — ఎమెస్కో ప్రచురణ

3. మరపురాని మనిషి మాడభూషి
   అనంతశయనం అయ్యంగార్ — తెలుగు భాషోద్యమ
   రచన: రావినూతల శ్రీరాములు — సమితి, తిరుపతి

4. డా. మండలి బుద్ధ ప్రసాద్ అందజేసిన వ్యాసాలు




